# LET'S CELEBRATE NOVEMBER

OUR SPECIAL MONTH

WATCH OUT FOR THE

CHILDREN'S SPECIAL ISSUE

OF CHANDAMAMA IN NOVEMBER 2001

*Exciting stories from child-writers!*

*Illustrations from child-artists!*

*Jokes, riddles, games - all from children!*

*Even the Vikram-Vetala story has come from a kid!*

*Your favourite comics, contributed by a child!*

From kids, for kids

Don't miss Chandamama's Children's Special Issue!

A sparkler to light up your Diwali!

A 
ACTIVE

B 
BUZZ BOSS

C 
CADET DX

D 
DEVIL DX

E 
ELEPHANT

F 
FISH

G 
GIRAFFE

H 
HEN

I 
INSECT

J 
JOKER

K 
KIDD DX

L 
LI'L ANGEL
LAMBADA LIMBO

M 
MISSILE MISS INDIA Jr

N 
NEST

O 
ORANGE

P 
PIRANHA

Q 
QUEEN Jr

R 
ROBO COP

S 
SPARKY SALSA

T 
TERMINATOR




V W

The largest range of kids bikes

**HERO CYCLES**

THE ABC OF CYCLING

ITA.5979.2001




















SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ. **120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# ఇచ్చేకొద్దీ పెరిగే విద్య!

మన దేశంలో దాదాపు యాభై సంవత్సరాల క్రితం వరకు, విదేశీపాలకులు తమకు ఉపయోగకరంగా రూపొందించిన విద్యావిధానమే అమలులో ఉండేది. అందుకే అప్పటి పాఠశాలలను, కళాశాలలను గుమాస్తాలను తయారుచేసే కార్ఖానాలుగా విమర్శించేవాళ్ళు. అయితే దేశం స్వాతంత్ర్యం పొందాక, విద్యావిధానంలో ఎన్నోమార్పులు వచ్చాయి. కాలానుగుణంగా పాఠ్యాంశాలలోనూ, బోధనా పద్ధతులలోనూ మార్పులు చోటుచేసుకున్నాయి.

వీటి ఫలితంగా మనదేశంలో ఉన్నత విద్యను అభ్యసించి, పెద్దపెద్ద ఉద్యోగాలు వెతుక్కుంటూ విదేశాలకు వెళ్ళే విద్యావంతులు కొందరయితే; పట్టాలను చేత పట్టుకుని నిరుద్యోగులుగా మిగిలిపోయేవారు మరెందరో తయారయ్యారు. మరోవైపు, క్రమేణా విద్యకూడా వ్యాపార వస్తువుగా మారిపోవడంతో అది చాలామందికి అందని మానుపండుగానే ఉంటోంది. అటువంటివాళ్ళు దేశజనాభాలో చెప్పుకోతగినంతమంది ఉన్నారు. ఉన్నత విద్యావకాశాలు మాత్రమేకాదు; కనీసం ప్రాథమిక విద్యకుకూడా నోచుకోని నిర్భాగ్యులకూ మనదేశంలో కొదవలేదు. దరిదాపుల్లో పాఠశాలలు లేకపోవడం; తల్లిదండ్రుల ఆర్థికదుస్థితీ; కుటుంబ పరిస్థితులూ ఈ దయనీయస్థితికి మూలకారణాలు.

అటువంటివారిని అక్షరాస్యులను చేయడానికి ప్రభుత్వం, పెద్దలుచేసే కృషితోపాటు, పిల్లలుకూడా ప్రయత్నించవచ్చు. విద్య అన్నది పాఠశాల తరగతి గదులకే పరిమితంకాదు. చదువుకున్న పిల్లలు— ఆ అవకాశం లేని ఇరుగుపొరుగు పిల్లలకూ, తమ ఇళ్ళల్లో పనిచేసేవాళ్ళ పిల్లలకూ తీరికసమయంలో చదువు నేర్పవచ్చు. మనం నేర్చిన విద్యను పదిమందికీ నేర్పడంవల్ల అది మరింత ప్రకాశిస్తుంది. వెలిగేదీపం నుంచి మరెన్ని దీపాలనైనా వెలిగించవచ్చు. పిల్లలు తమకు తెలిసినవాటిని సాటి పిల్లలకు నేర్పడంద్వారా తమ విద్యనుకూడా అభివృద్ధిపరచుకోవచ్చు. పైగా, అలాంటివారికి మనుషులను గురించీ, బయటి ప్రపంచం గురించీ అవగాహన పెరుగుతుంది.

అక్టోబర్ రెండు, మహాత్మాగాంధీ జన్మదినం. "బాలబాలికలలోని శక్తిసామర్థ్యాలను వెలికితెచ్చేదే అసలైన విద్య!" అన్న బాపూజీ సూక్తిని గుర్తుతెచ్చుకుని ఆచరణలో పెడదాం.

నవరాత్రి సందర్భంగా చదువులతల్లి సరస్వతిని పూజించే ఈ శుభసమయంలో ప్రతి హృదయంలోనూ అక్షరదీపం వెలిగించడానికి ప్రతి ఒక్కరమూ ప్రయత్నిద్దాం!

సంపాదకుడు : విశ్వం





హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 1

మిత్రులారా! ఈ హీరోస్ క్విజ్‌ను జాగ్రత్తగా చదవండి. ఇక్కడ పేర్కొన్న వీరులందరూ మన చరిత్ర పుటలకు సంబంధించినవాళ్ళే. కాబట్టి, మీకు తప్పక తెలిసే ఉంటారు!

అన్నీ సరైన సమాధానాలుగల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!

1 1526లో విజృంభించి భారతదేశంలో అల్లకల్లోలం సృష్టించాను. నా వారసులు నాకు కీర్తి తెచ్చారు. మా తల్లి కుటుంబం పేరు మీదుగానే మావంశానికి ఆ పేరు వచ్చింది. నేను ఎవరు?

..........................................................................

2 సౌందర్యరాశి సంయుక్త ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరి అయ్యేలా ఆమెను గుర్రంపైకి లాక్కున్నాను. ఇరువురం కలిసి ఆనంద సాగరతీరాలను చేరాము. నేనెవరో మీకు తెలుసా?

..........................................................................

3 17వ శతాబ్దంలో సృష్టించబడిన మయూర సింహాసనం నాదగ్గర ఉండేది. అందమైన నా భార్యను ఎంత గాఢంగా ప్రేమించానంటే, ఆమె మరణించినప్పుడు నేను ఏం నిర్మించానో తెలుసా? వద్దు ..ఆ సంగతి చెబితే నేనెవరో తెలిసిపోతుంది!



..........................................................................

4 గ్రీకు యువరాజును ధైర్యంగా ఎదుర్కొని పోరాడాను. కాని గెలువలేకపోయాను. ఆ రాజు ఎదుట నిలబడి, "నువ్వు సాటి రాజుపట్ల ఎలా నడుచుకుంటావో, నా విషయంలోనూ అలాగే నడుచుకో," అని ఆత్మస్థయిర్యంతో పలికాను. నేనెవరో మీకు తెలుసా?

..........................................................................

5 అతి భీకరంగా జరిగిన యుద్ధంలో విజయం సాధించాను. అయితే, అదే నాజీవితాన్ని కొత్తమలుపు తిప్పింది. హింసను పూర్తిగా వదిలిపెట్టాను. నా పేరేమిటో చెప్పగలరా?

..........................................................................



ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధా నాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన వీరుడు ఎవరు? ఎందుకు? అన్నివిషయాలను పది పదాలకు మించకుండా రాయండి. చరిత్రలో నా అభిమాన వీరుడు

..........................................................................

..........................................................................

..........................................................................

పాల్గొనేవారి పేరు : ..........................................

వయసు : .......................... తరగతి : ..........................

చిరునామా: ..........................................

..........................................................................

పిన్ : .................. ఫోన్ : ..........................

పాల్గొనేవారి సంతకం : ..................................

తల్లి/తండ్రి సంతకం : ..................................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2001 నవంబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి.

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్టయితే, నా అభిమాన వీరుడు వివరణ ఆధారంగా విజేతలు ఎంపికచేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులు మీకు అందజేస్తున్నవారు





# మంచిదొంగ

చిన్నప్పటినుంచీ విద్యాధరుడికి, కవిత్వమంటే ఎంతో ఇష్టం. అతడు ఎక్కడెక్కడి కావ్యాలూ వెదికితెచ్చుకుని చదువుతూ, పదేళ్ళ వయసుకే తనేస్వయంగా కవిత్వం చెప్పగలిగాడు. ఒకసారి, చుట్టపుచూపుగా అతడింటికి వచ్చిన పండితు డొకాయన, విద్యాధరుడి కవిత్వానికి ఎంతో ముచ్చటపడి, అతడి తల్లిదండ్రులకు, "విద్యాధరుణ్ణి దండకారణ్యంలోని వాణీనాధుడి వద్దకు పంపండి. కవిత్వంతోపాటు సకల శాస్త్రాలలోనూ ఆరితేరినవాడవుతాడు," అని సలహా యిచ్చాడు.

తల్లిదండ్రులాయన సలహా పాటించి, విద్యాధరుణ్ణి దండకారణ్యం పంపించారు. అతడక్కడ వాణీనాధుడి గురుకులంలో, ఆరుసంవత్సరాలు బహుశ్రద్ధగా విద్యాభ్యాసం చేసి,గురువు మన్ననలందేవిధంగా చదువు పూర్తిచేశాడు. అతడు ఒకవారం రోజుల్లో తన ఇంటిముఖం పట్టాలని అనుకుంటూండగా, ఒక దుర్ఘటన జరిగింది. వాణీనాధుడిశిష్యులు కొందరు విద్యాధరుడితో సహా కందమూలాలు తేవడానికి, ఆశ్రమం నుంచిఅరణ్యం లోపలికి వెళ్ళారు. వాళ్ళు అలా అరణ్యంలో మరికొంత దూరం వెళ్ళేసరికి, వాళ్ళకు కొందరు బాటసారు లను దోచుకుంటున్న దొంగలు కనబడ్డారు. దొంగలు వాణీనాధుడి శిష్యులను చూడగానే భయపడి అక్కడి నుంచి పారిపోసాగారు. శిష్యులు వాళ్ళను వెంటబడి తరిమారు. విద్యాధరుడు కూడా ఒక దొంగను వెంటబడి వెళ్ళాడు. ఆ దొంగచెట్లచాటుకువెళ్ళి కనబడకుండాపోయాడు.

విద్యాధరుడు, ఒక చెట్టువెనక్కువెళ్ళి చూడగా , అక్కడ ఒక ముని తపస్సు చేసు కుంటూ కనిపించాడు. దొంగ వేషంమార్చి అలా కూర్చున్నాడని భ్రమపడిన విద్యాధరుడు, "నేను నిన్ను కనుక్కోలేనను కున్నావా?," అంటూ గడ్డం పట్టుకుని లాగాడు.

"వసుంధర"



మునికితపోభంగమైంది. ఆయనకళ్ళు తెరిచి, సంగతి గ్రహించి "మూర్ఖుడా! నన్ను దొంగఅని అవమానించినందుకు, ఒక ఏడాది పాటు రోజుకొక్క నేరమైనా చేస్తూ, దొంగబ్రతుకు బ్రతుకు. అలా చెయ్యకపోతే నువ్వు చదివిన దంతా మరచి పోతావు!" అని శపించాడు.

విద్యాధరుడు, మునికాళ్ళమీద పడి వేడుకున్నాడు. కాని ముని మనసు కరగలేదు. చివరకు అతడు ఆశ్రమానికి తిరిగివెళ్ళి, జరిగినదంతా గురువుకు చెప్పి ఏడ్చాడు.

వాణీనాధుడు, శిష్యుణ్ణి ఓదార్చి, "విధి రాతను ఎవరూ తప్పించలేరు. జరిగినదానికి విచారిస్తూ కూర్చుంటే లాభంలేదు. ఏడాది పాటు ఏ నేరం చెయ్యకుండావుంటే, నీ చదు వంతా వృధా అవుతుంది. నువ్వు కాంభోజీ నగరానికివెళ్ళు. అక్కడ లెక్కలేనంతమంది సంపన్నులున్నారు. లెక్కకు మించినసంపద న్యాయమార్గంలో రాదుకదా! నువ్వు,వారి ఇళ్ళల్లో దొంగతనాలు చెయ్యి. ఒకఏడాదిపాటు నువ్వే నేరంచేసినా, నువ్వు పట్టుబడకూడదు. ఒక ఏడాదిపాటు దొంగతనం అనే కళలోని అన్నిమెలువకులు తెలుసుకుంటున్నాననుకో! నీ అనుభవాలన్నీ పుస్తకరూపంలో రాస్తే, అది చోరులను గురించి తెలుసుకునేందుకు రక్షక భటులకు సహకరిస్తుంది," అన్నాడు.

గురువు చెప్పినట్లే విద్యాధరుడు వెళ్ళాడు. తన చాతుర్యాన్నంతా ఉపయోగించి, రోజు రోజుకూ పద్ధతులు మార్చుతూ, అక్కడ దొంగతనాలు ప్రారంభించాడు. రక్షకభటులు ఎన్ని పథకాలు పన్నినా, విద్యాధరుడు వారికి దొరకలేదు.

గురువు సలహానుసరించి, విద్యాధరుడు తను చేసిన ప్రతి దొంగతనం గురించీ వివరంగా తాళపత్రాల మీద రాసుకుని భద్రపరుస్తున్నాడు. అతడు, శ్రీకరుడనే మధ్యతరగతి కుటుంబీకుడి ఇంట బసవుంటున్నాడు. అతడి పాండిత్య ప్రతిభకు, ఆ ఇంటివారేకాక, చుట్టుపక్కల వారూ అచ్చెరువు చెందేవారు. ఎవరికీ తనమీద అనుమానం రానివిధంగా మసలుకుంటూ, ఎవరికీ తెలియనివిధంగాదొంగతనాలుచేస్తూ, రోజులు లెక్కపెట్టుకుంటున్నాడు, విద్యాధరుడు.

శ్రీకరుడికి పదునాలుగేండ్ల వయసున్న కుమార్తె వున్నది. ఆమెకు విద్యాధరుడి కవిత్వమంటే ఎంతో ప్రాణం. ఒకసారి అతడామెకు రోజంతా కనబడలేదు. ఏమ య్యాడోనని వెతుకుతూ, ఆమె అతడుంటూన్న ఇంటి భాగంలో ప్రవేశించింది. ఇంట్లో విద్యా ధరుడు కనబడలేదు. ఒకచోట ఆమెకు కొన్ని తాళపత్రాలు కనిపించాయి. అవి చదువు

తూంటే ఆమెకు నగరాన్ని అల్లకల్లోలంచేస్తున్న గజదొంగ విద్యాధరుడేనని తెలిసిపోయింది. ఆ తాళపత్రాలు తీసుకుని ఆమె బయటకు వెళ్ళబోతూండగా, హఠాత్తుగా అక్కడికి విద్యాధరుడు వచ్చాడు. జరిగిందేమిటో అతడికి అర్థమైపోయింది.

"ఈ నగరంలో నేనిక రేపొక్కరోజుమాత్రమే వుండాలనుకున్నాను. అంతవరకూ నా గురించిన రహస్యం ఎవరికీ తెలియకూడదనుకున్నాను. ఐతే నీకు తెలిసిపోయింది! నిన్ను బ్రతకనివ్వను. ఎవరు చంపారో తెలియని విధంగా, నిన్ను హత్య చేస్తాను," అన్నాడు విద్యాధరుడామెతో.

శ్రీకరుడి కుమార్తె భయంతో వణికిపోతూ, "రేపు నువ్వేం నేరం చెయ్యబోతున్నావో ముందుగా రాసిపెట్టుకున్నావు. అదీ నేను చదివాను. అయినా, నీ గురించి ఎవరికీ చెప్పను. నన్ను చంపకుండా వదిలి పెట్టు," అని బ్రతిమలాడింది.

విద్యాధరుడు సరేనని ఆమెను విడిచి పెట్టాడు. అయితే ఆమె అన్నమాటను నిలబెట్టుకోలేదు. జరిగింది తండ్రికి చెప్పింది. తండ్రి, నగర రక్షకుడికి ఫిర్యాదు చేశాడు. మర్నాడు విద్యాధరుడు ఒక ఇంట దొంగతనం చేస్తూండగా, ముందే విషయం తెలుసుకాబట్టి, నగరరక్షకుడు భటులతోవెళ్ళి అతణ్ణిపట్టుకుని కారాగారంలో వేశాడు. ఈ వార్త నగరంలో పెద్ద సంచలనం కలిగించింది. నగరపాలకుడు, విద్యాధరుడిపై బహిరంగ విచారణ జరిపించగా, అతడాయనకు తన కథను చెప్పుకున్నాడు.

అంతా విన్న నగరపాలకుడు, "నీ కథ



నమ్మశక్యంగాలేదు. అయినప్పటికీ నువ్వానే ఆ వాణీనాథుడివద్దకు దూతను పంపి, నిజం తెలుసుకోగలను. కానీ నాకు కొన్ని సందేహాలుండిపోయాయి. నువ్వు పండితుడివి. గురువు నీకు వరమిచ్చినంత మాత్రాన, నీ నేరాలు నీకంటకుండా వుండగలవని ఎలా నమ్మావు? ఒకవేళ నమ్మినా, చివరి నేరంలో పట్టుబడిపోవడంవల్ల, ఆ వరమెలాగూ కొరగాకుండాపోయింది గదా!" అన్నాడు.

"నేను నానేరాలకు ప్రాయశ్చిత్తం వరాలతో చేసుకోదలచలేదు. అందుకే, ప్రతి దొంగతనం వివరాలూ రాసుకున్నాను. నా దొంగతనంవల్ల, రోజువారీ అవసరాల్లో ఏ ఇబ్బందీ కలగని వారినే దోచుకున్నాను. ఆ డబ్బంతా నాదగ్గర భద్రంగా వున్నది. శాపానికి భయపడి మాత్రమే దొంగతనాలు చేశాను కాబట్టి, శాప కాలం పూర్తికాగానే ఎవరిడబ్బు వారికిచ్చేస్తాను. ఆ విధంగా, నా నేరాలకు ప్రాయశ్చిత్తం

జరుగుతుందని, నా నమ్మకం,'' అన్నాడు విద్యాధరుడు.

దానికి నగరపాలకుడు చిన్నగా నవ్వి, ''నీ నమ్మకం శ్రీకరుడి కుమార్తెను నమ్మినప్పుడే దెబ్బతిన్నది. నిజంగా శాపానికి భయపడిన వాడివైతే, ఆమెను హతమార్చి వుండేవాడివి. అలా చెయ్యకపోవడంవల్ల నేను నీ కథను నమ్మలేకపోతున్నాను,'' అన్నాడు.

అప్పుడు విద్యాధరుడు చేతులు జోడించి, ''అయ్యా! నే చెప్పేదికాస్త శ్రద్ధగా వినండి. నేనెక్కడదొంగతనంచేసినా, తిరిగి ఇవ్వగలిగినదే తీసుకున్నాను. శ్రీకరుడి కుమార్తె ప్రాణాలు తీస్తే, తిరిగి ఇవ్వగలిగిన సామర్థ్యం నాకులేదు. అందుకే నేనామెను బెదిరించాను తప్పితే చంపలేదు. ఆమెను చంపకపోవడంవల్ల, నా ఏడాది శ్రమా బూడిదలోపోసిన పన్నీరై, నాకు శాపం తగిలి పామరుణ్ణయిపోగలనని తెలిసినా నేనాపని చెయ్యలేదు,'' అన్నాడు.

''ఆ సంగతే నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది,'' అన్నాడు నగరపాలకుడు.

''అయితే వినండి! దొంగల్లో మంచి దొంగలుంటారు. వాళ్ళు గత్యంతరంలేకనే దొంగతనాలు చేస్తారు. ఏమాత్రం వీలుపడినా, వాళ్ళు తాము దోచింది తిరిగివ్వాలనే అనుకుంటారు. తిరిగి ఇవ్వలేనివి వాళ్ళు ముట్టరు. నేను మునిశాపం తగిలిన మంచిదొంగను. మరికొందరు పేదరికం శాపం తగిలిన మంచిదొంగలుంటారు. అలాంటి వారిలో మంచి మార్పు తీసుకురావడానికీ, అలాంటివారికి సాయపడమని ప్రబోధించడానికీ, నా కథ ఎంతగానో ఉపయోగపడుతుందని, నా నమ్మకం,'' అన్నాడు విద్యాధరుడు.

ఈ మాటలకు, న్యాయవిచారణ విన వచ్చిన ప్రజలు కరతాళధ్వనులు చేశారు. నగరపాలకుడు, విద్యాధరుణ్ణి విడిచిపెట్టడమేగాక, ఘనసన్మానం కూడా చేశాడు.

దొంగతనం చేయడంలో తన అనుభవాలను తెలియజేస్తూ విద్యాధరుడు రాసిన పుస్తకాన్ని, అధికారులూ రక్షకభటులూ చదవడంతో దొంగతనాలను అరికట్టగలిగారు. ఆ రాజ్యంలో దొంగతనాలు బాగా తగ్గిపోయాయి.






# 10

[వీరపురరాజు ఆజ్ఞాపించగా, సేనానాయకుడు గుర్రపు రౌతుల్నీ, కాల్బలాన్నీ వెంటబెట్టుకుపోయి, కొండమీదవున్న స్వర్ణాచారినీ, సమరబాహు అనుచరులనూ లొంగిపొమ్మని హెచ్చరించాడు. సమరబాహు అనుచరులు, గురిచూసి వీరపుర సైనికులమీదికి ఈటెలు విసిరారు. అందులో ఒకటి రయ్‌మంటూ పోయి, వీరపురసేనాని భుజంలో గుచ్చుకున్నది. — తరవాత]

ఈటె దెబ్బ తింటూనే వీరపుర సేనాని ఒక చావుకేకపెట్టి, గుర్రంమీదినుంచి కిందపడి పోయాడు. ఆ పడే సమయంలో భుజంలో గుచ్చుకునివున్న ఈటె జారి పక్కన పడింది. అతణ్ణి సైనికులు దూరంగా తీసుకుపోయి, గాయానికి కట్టుకట్టారు. స్వర్ణాచారి సమర బాహు అనుచరులను మెచ్చుకుంటూ, "మొదటిదెబ్బతోనే మనం శత్రువులను హడల గొట్టాం. మనం లెక్కకు ఇరవై ఆరుగురమే అయినా, ఈ దెబ్బతో శత్రువులు మనను ఎక్కువగా అంచనా వేస్తారు!" అన్నాడు.

ఆ మాట వింటూనే సమరబాహు అనుచ రుడొకడు, "ఆచార్య మహామంత్రీ! శత్రువులు ఒకవేళ సాహసించి కొండ ఎక్కాలని చూశారో, మనం నియోగించిన ఆటవికులు, వాళ్ళ మీదికి సింహాన్నీ, పులులను వదిలి చీకాకు పరుస్తారు," అన్నాడు.

మరిద్దరు సమరబాహు అనుచరులు, "ఆచార్య మహామంత్రీ! ఆజ్ఞ ఇవ్వండి, మేమంతా పోయి గుంపుగావున్న శత్రువుల మీద పడి, మా ఈటెలకు వాళ్ళను ఎరచేసి, వాళ్ళెక్కి వచ్చిన గుర్రాలను పట్టుకుంటాం," అన్నారు.

అతడు వాళ్ళతో, "సంఖ్యలో శత్రువులు మనకన్న పదింతలున్నారు. అందువల్ల మనకు ఏమాత్రం తొందరపాటు పనికిరాదు. చాలా



జాగ్రత్తగా ఉండాలి. మన ఒంటెలనన్నిటినీ కొండ అవతలవున్న పల్లపు ప్రాంతంలో జాగ్రత్తపరిచారు గదా?'' అన్నాడు.

''వాటన్నింటినీ ఒకచోట మందవేసి, ఇద్దర్ని కాపలా పెట్టాం. శత్రువులక్కడా, మనం ఇక్కడా, అంతేనా?'' అన్నారు సమర బాహు అనుచరులిద్దరూ.

వాళ్ళ మాటలకు స్వర్ణాచారి నవ్వి, ''యుద్ధం అప్పుడే ముగిసిపోయిందని భ్రమపడకండి!'' అని, గుర్రాలెక్కుతున్న వీరపుర సైనికుల్ని చూపించాడు.

అంతలో ఇద్దరు సైనికులు పట్టి ఎత్తి, సేనానాయకుణ్ణి గుర్రంమీద కూర్చోబెట్టారు. అతడు గుర్రాన్ని పరిగెత్తిస్తూ కొండ దిగువ భాగాన్ని చూడసాగాడు. అతడి వాలకం చూస్తేనే స్వర్ణాచారికి, శత్రు సేనాని కొండె క్కేందుకు సులువైన మార్గం కోసం వెతుకు తున్నట్టు అర్థమైంది.

స్వర్ణాచారి, సమరబాహు అనుచరులను వడిసెలలూ, ఈటెలూ శత్రువులపై విసిరేం దుకు సిద్ధంగా వుండమని హెచ్చరించి, సింహం, పులులు వున్న చోటుకు వెళ్ళాడు.

సింహంవున్న బోను ఒక గుహ ముందు భాగాన వున్నది. పులులున్న బోనులూ అలాగే మరొక గుహముందున్నవి. ఆ బోనుల మీద ఇద్దరేసి ఆటవికులు కూర్చుని వున్నారు. స్వర్ణాచారిని చూస్తూనే ఆటవిక నాయకుడు, ''వీరపురసైనికులు కొండ ఎక్కి ఈ దాపులకు రాగానే, బోనుల తలుపులు ఎత్తేసి, మావాళ్ళు పారిపోతారు. ఈ క్రూరమృగాలు శత్రువులను చీల్చి చెండాడుతవి,'' అన్నాడు.

ఈ ఏర్పాటుకు చాలా సంతోషించిన స్వర్ణా చారి, సమరబాహు అనుచరులదగ్గరకు తిరిగి వచ్చి కొండ దిగువకు చూశాడు. వీరపుర సేనాని ఆజ్ఞాపించగానే, కాల్బల సైనికులు కాలిబాట వెంట కొండఎక్కడం ప్రారంభించారు. వాళ్ళల్లో కొందరిదగ్గర విల్లంబులున్నవి. పైనుంచి సమరబాహు అనుచరులు ఈటెనుగాని, వడిసె లతో రాళ్ళనుగాని విసిరినప్పుడల్లా, సైనికులు ఆగి, వాళ్ళకేసి బాణాలు కొడుతున్నారు. ఇంతలో కొందరు గుర్రపు రౌతులు, సైనికులకు వెనకగా కొండ ఎక్కసాగారు.

రానున్న ప్రమాదాన్ని గ్రహించిన స్వర్ణా చారి, సమరబాహు అనుచరులకు ధైర్యం చెబుతూ, '' ఉష్ట్ర వీరుల్లారా! మీలో కొందరు శత్రువులమీదికి బండరాళ్ళు దొర్లించండి, మిగిలినవాళ్ళు గురిచూసి వడిసెలలు ప్రయోగించండి!'' అని హెచ్చరించాడు.

సమరబాహు అనుచరులు పెద్దపెద్ద రాళ్ళను నెట్టుకువచ్చి, కాలిబాట వెంట పైకి

వస్తున్న వీరపుర సైనికులకేసి దొర్లించారు. కాని వాటిల్లో చాలాభాగం దారిలో వున్న ఎత్తూ పల్లాల్లో పడిలేస్తూ గురితప్పి మరొక మార్గాన దొర్లుకుపోసాగిన్నై. ఇది చూసిన వీరపుర సైనికులు ఉత్సాహంగా కేకలువేస్తూ పైకి రాసాగారు. వాళ్ళను అనుసరించి వస్తున్న అశ్వికులు కత్తులుదూసి పైకెత్తి పట్టుకుని, తమ రాజుకు జయజయధ్వానాలు చేయసాగారు.

అంతలో హఠాత్తుగా సింహగర్జన, పులుల గాండ్రింపూ వినిపించింది. మరుక్షణం సింహం, పులులూ బోనుల్లోనుంచి కుప్పించి బయటికి దూకి, అందుబాటులో వున్న వీరపుర సైనికుల మీద పడిన్నై. హఠాత్తుగా వచ్చిన ఈ దాడిని వాళ్ళు ఎదుర్కొనేందుకు సిద్ధంగా లేరు. ఈ గందరగోళంలో సైనికుల వెనకవస్తున్న అశ్వికుల గుర్రాలు బెదిరి, చప్పున వెనుదిరిగి పారిపోబోయి, రౌతులతో పాటు కాళ్ళుజారి కిందపడి పల్లటీమీద పల్లటీ కొడుతూ కొండ దిగువకు పోయి పడిన్నై. సింహం, పులులూ తమకడ్డొచ్చేవాళ్ళెవరూ లేకపోవడంతో, చేరువలోవున్న అరణ్యంకేసి పరిగెత్తిన్నై.

ఈ జరిగినదానికి చాలా సంతోషించిన స్వర్ణాచారి, సమరబాహు అనుచరులతో, ''చచ్చిన వాళ్ళూ, గాయపడ్డవాళ్ళూ పోగా, ఇంకా చాలా మంది కొండదిగువున వున్నారు. మనం వాళ్ళ దాడిని మరొకసారి తిప్పికొట్టలేం. మనం కొండ పక్క పల్లపు ప్రదేశంలో దాచిన మన ఒంటెల నెక్కి అరణ్యంలోకి పోదాం. అక్కడ క్షత్రియ యువకులూ, సమరబాహు మహారాజుకూడా కనిపించవచ్చు. అందరూ ఒంటెలున్నచోటుకు బయలుదేరండి!'' అంటూ ముందుండి దారితీశాడు.



అయితే, స్వర్ణాచారీ, సమరబాహు అనుచరులూ ఒంటెలున్నచోటుకు పోయి, వాటిపైన ఎక్కి పల్లపుప్రదేశం నుంచి పైకి వచ్చేసరికి, సుమారు రెండువందల గజాల దూరంలో నలభై,యాభైమంది వీరపుర అశ్వికులు కత్తులూ, ఈటెలూ పైకెత్తి పట్టుకుని వాళ్ళకేసి వస్తున్నారు.

ఇది చూసిన స్వర్ణాచారి కత్తి పైకెత్తి, ''ఉష్ట్ర యోధుల్లారా, నా వెంటరండి, శత్రువుల్ని కొండ కోటదేవికి బలిపెడదాం. సమరబాహు మహారాజుకూ, జై!'' అంటూ ఒంటెను ముందుకు దూకించాడు. అదేసమయంలో వీరపుర అశ్వికులు, ''వీరసింహమహారాజుకూ జై!'' అంటూ తమ గుర్రాలను అదిలించి, శరవేగంతో వచ్చి సమరబాహు అనుచరులమీద పడ్డారు.

స్వర్ణాచారి కత్తిదూసి ధైర్యంగా వీరపుర అశ్వికులమీదికి తన ఒంటెను దూకించడం

చూసి, సమరబాహు అనుచరులు ఎక్కడలేని తెగువతనంతో పోయి శత్రువులమీద కలియ బడ్డారు. అప్పుడువీరపుర అశ్వికులకూ, సమర బాహు ఉష్ట్రయోధులకూ మధ్య భయంకర మైన పోరాటం సాగింది.

నాలుగైదు నిమిషాలకాలం ఈవిధంగా పోరు జరిగేసరికి కొందరు సమరబాహు అను చరులూ, వీరపుర సైనికులూ గాయపడి, తమతమ వాహనాలమీదినుంచి పట్టుతప్పి కిందపడిపోయారు. స్వర్ణాచారి తన అనుచరు లనుహెచ్చరిస్తూ, చావగా మిగిలినపదిహేనూ, పదహారుమంది ఉష్ట్రయోధులతో శత్రువుల మధ్య దారిచేసుకుని, దాపులవున్న అరణ్యంకేసి పారిపోసాగాడు.

ఆ సమయంలో, భుజంమీది గాయం బాధతో మధ్యమధ్య మూలుగుతూ అక్కడి కొచ్చిన వీరపురసేనాని, పారితున్న స్వర్ణాచారీ, అతడి అనుచరులకేసిచూసి, ''ఇంత కొద్ది మంది శత్రువులు మన చక్రబంధాన్ని ఛేదించు కుని పారిపోగలిగారన్నమాట! ఇంతకన్న అవమానం ఏముంటుంది! నేను పంపిన అశ్వదళనాయకుడెక్కడ? బతికున్నాడా, చచ్చాడా?'' అంటూ కోపంగా అరిచాడు.

ఆ అరుపు వింటూనే ఆశ్వికదళనాయ కుడు, సేనాని ముందుకు వచ్చాడు. సేనాని అతడికేసి కళ్ళెర్రచేసి చూస్తూ, ''ఆ చొక్కా, పైపంచాకూడా లేని పిలకవెధవ, మహాయో ధులైన వీరపుర ఆశ్వికుల్లో కొందరిని చంపి క్షేమంగా అరణ్యంలోకి పారిపోయాడని తెలిస్తే, మహారాజుగారేమంటారు? నీకూ, నాకూ ఉరి తప్పదు,'' అన్నాడు.

దళనాయకుడు భయకంపితుడైపోయి, వణుకుతున్న గొంతుతో, ''మహాసేనానీ! ఆ పిలకవెధవ ఒట్టొట్టి పిలకవెధవకాదు. అతణ్ణి, ఆచార్య మహామంత్రీ అంటూ అతడి అను చరులు సంబోధించడం విన్నాను. అతడు రూపురేఖల్లో, శౌర్యపరాక్రమాల్లో మహా భారతంలోని....''

దళనాయకుడు మాట ముగించకముందే సేనాని గట్టిగా, ''ఇక ఆ భట్టుకవిత్వం చాలు,



నోర్మూయ్యి!'' అని కోప్పడి, ''నువ్వు నలుగురు ఆశ్వికుల్ని వెంటబెట్టుకుని, ఆ గుండుపిలక ఒంటెవెధవా వాళ్ళు అరణ్యంలో ఎక్కడ దాగి వున్నారో వెంటనేవెదికిచూడు. నేను ముందుగా ఈ కొండకోటను స్వాధీనపరుచుకుని, మన వీరపురరాజ్య పతాకాన్ని దానిమీద ఎగరవేసి, సైన్యంతో అరణ్యంలోకి వస్తాను,'' అన్నాడు.

దళనాయకుడు అక్కణ్ణించి బయలుదేరాడు. కానీ,స్వర్ణాచారి ఆసరికేఅరణ్యంలో చాలాదూరం వెళ్ళిపోయాడు. దారిలో అతడికి ఒక కొలను కనిపించింది. స్వర్ణాచారీ, సమరబాహు అను చరులూ అక్కడ ఒంటెలను దిగి, వాటికి కొలనులో నీళ్ళుపెట్టి, మేయడానికి వదిలిపెట్టి ఒక చెట్టుకింద కూర్చున్నారు.

ఒక అరగంటకాలం గడిచింది. చెట్లల్లో ఏదైనా కాయలూ, పళ్ళూ కొరుకుతవేమో నని వెతుకుతున్న ఇద్దరు సమరబాహు అను చరులకు, కొలనుకేసి వస్తున్న పదీ పన్నెండు మంది ఎలుగ్గొడ్డుముఠావాళ్ళు కనిపించారు. సమరబాహు అనుచరులు పరుగు పరుగున పోయి, ఆ సంగతి స్వర్ణా చారికి చెప్పారు.

''వెతకబోయిన తీగ కాలికి తగలడమంటే ఇదే! ఈ ముఠావాళ్ళే మన సమరబాహు రాజును బందీగా పట్టుకుపోయారు,''అన్నాడు స్వర్ణాచారి.

అంతలో ఎలుగ్గొడ్డుముఠావాళ్ళు, కొలను సమీపించారు. వాళ్ళల్లో ఒకడు, దాపుల మేస్తున్న ఒంటెలను చూసి, ''వృకేశ్వరీమాతా, నువ్వే దిక్కు!''అని కేకపెట్టి, మిగతావాళ్ళకు ఒంటె లను చూపించాడు.

ఆ మరుక్షణం, స్వర్ణాచారీ, సమరబాహు అనుచరులూ చెట్లచాటునుంచి, ''సమర



బాహు మహారాజుకూ,జై!''అంటూ ఈటెలెత్తి వాళ్ళకేసి బయలుదేరారు.

వాళ్ళను చూస్తూనేఎలుగ్గొడ్డుముఠావాళ్ళు, ''చస్తిమి, వృకేశ్వరీమాతా'' అంటూ వెనుదిరిగి స్వర్ణాచారికి దొరక్కుండా పారిపోయారు.

అలా పారిపోతున్న ఎలుగ్గొడ్డువాళ్ళకు దారిలో ఖడ్గ,జీవదత్తులూ, సమరబాహూ, గురుభల్లూకుడూ కనిపించారు. వాళ్ళు స్వర్ణాచారిని గురించి వాళ్ళకు చెప్పారు.

''ఎక్కడో కోటకట్టే ప్రయత్నాల్లోవున్న స్వర్ణాచారి, ఈ ప్రాంతానికి ఎందుకొచ్చినట్టు? కొండమీద ఏవోచిక్కుల్లోపడి ఇక్కడికి పారి పోయి రాలేదుగదా!''అన్నాడు జీవదత్తుడు.

''స్వర్ణాచారి గొప్ప రాజభక్తిపరాయణుడు. బహుశా, నన్ను ఎలుగ్గొడ్డుముఠావాళ్ళనుంచి కాపాడాలన్న ప్రయత్నంలో ఇక్కడికి వచ్చి వుంటాడు!'' అన్నాడు సమరబాహు ఎంతో తృప్తిగా.



వాళ్ళిలా మాట్లాడుకుంటూ కొలనును సమీపిస్తున్నంతలో, స్వర్ణాచారి వాళ్ళను చూసి బ్రహ్మానందంచెంది, వాళ్ళదగ్గరకు పరుగు పరుగున వచ్చి, "సమరబాహు మహారాజా, క్షత్రియయోధుల్లారా, ఇవే నానమస్కారాలు!" అన్నాడు వంగి నమస్కరిస్తూ.

"స్వర్ణాచారీ! నువ్వేదో మీ మహారాజుగారి కోటను గాలికివదిలి, అరణ్యవిహారానికి బయలు దేరి వచ్చినట్టున్నదే!" అన్నాడు జీవదత్తుడు.

"క్షత్రియ వీరయోధుల్లారా! ఆ కోట శత్రువుల వశమైపోయింది. దాన్ని రక్షించేం దుకు నేనూ, సమరబాహు మహారాజుగారి అనుచరులూ గట్టి ప్రయత్నం చేశాం. ఆ ప్రయత్నంలో కొందరు వీరస్వర్గం అలంకరిం చారుకూడా!" అన్నాడు స్వర్ణాచారి కొంచెం విచారంగా.

"సరే, వీరస్వర్గాన్ని అలంకరించకుండా ఇక్కడే వుండిపోయినవాళ్ళెంతమంది?" అని అడిగాడు ఖడ్గవర్మ నవ్వుతూ.

"నాతో కలిపి పదహారుమంది. మా వాహ నాలు ఉష్ట్రాలుకూడా ఇక్కడే వున్నవి," అన్నాడు స్వర్ణాచారి.

"కొండకోటను శత్రువులు ఆక్రమించారా? ఎవరా శత్రువులు?" అన్నాడు సమరబాహు కోపంకొద్దీ పటపట పళ్ళుకొరికి, మీసం మెలివేస్తూ.

స్వర్ణాచారి, అరణ్యంలోకి వచ్చిన వీరపుర జంతుప్రదర్శనశాలాధికారితో ప్రారంభించి, జరిగినదంతా సమరబాహుకు వివరంగా చెప్పాడు.

అంతా శ్రద్ధగా విన్న సమరబాహు పెద్దగా నిట్టూర్చుతూ, "అంటే కోటతోపాటు, మనం ఎంతోకాలంగా కూడబెట్టిన ధన ధాన్య సంపద యావత్తూ శత్రువశమైందన్నమాట! ఆ వీరపుర రాజునుక్షమించరాదు. అతడి అంతుచూడాలి. ఖడ్గ జీవదత్తుయోధుల్లారా! ఇందుకు మీరు నాకు సాయపడాలి," అన్నాడు.

జీవదత్తుడు ఒక క్షణం ఆగి, "సమర బాహూ! నువ్వు రాజ్యం సంపాయించి పోగొట్టు కున్నవాడివి కాదుగదా, వీరపురరాజుమీద పగసాధించడానికి! ఈ మహారణ్యంలో ఏ ప్రాంతాన అయినా, నీ అనుచరులతో కలిసి సుఖంగా పంటలు పండించుకుంటూ, హాయిగా జీవించవచ్చునే!" అన్నాడు.

దానికి సమరబాహు జవాబివ్వకుండా తలవంచుకున్నాడు. అప్పుడు స్వర్ణాచారి కలగ జేసుకుని, "క్షత్రియ యోధుల్లారా, నాదొక మనవి, చిత్తగించాలి! పేరునుబట్టి, ఈ సమర బాహు మహారాజు ఏ గొప్ప క్షత్రియ వంశీయుడో అయివుంటాడని తెలుస్తూనేవున్నదిగదా. అలాంటి

మహారాజుదగ్గర మంత్రిత్వం నెరపాలన్న కోరిక నాక్కలుగుతున్నది. మీరు సాయపడితేకనీసం, ఆ వీరపురరాజును కొండకోట ప్రాంతాల నుంచయినా తిరోగమించేలా చేయగలం. అప్పుడు కొండకోట, ఆ చుట్టుపక్కలవున్న ఆటవిక గూడేలతో కలిపి ఒక చిన్న రాజ్యమవుతుంది,"అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మకేసి చూసి, "ఖడ్గా, ఈపాటి సాయం మనం చేయడం బావుంటుందనుకుంటాను," అని, సమరబాహు, స్వర్ణాచార్లతో, "మనం ముందుగా వీరపుర సైనికుల్ని దెబ్బతీయాలి. అల్పసంఖ్యలో వున్న మనం వాళ్ళతో ముఖాముఖి యుద్ధం చేయలేం. ఉపాయంతో వాళ్ళను ఓడించాలి. ఆ సైనికులందర్నీ ఎలాగైనా గురుభల్లూకుడి బిలంలో ప్రవేశించేలా చేయడం అవసరం," అన్నాడు.

"అదెలా సాధ్యం, జీవదత్త ప్రభూ!" అన్నాడు స్వర్ణాచారి సంశయిస్తూ.

"అందుకొక మార్గంవున్నది. గురుభల్లూకుడి శిష్యుల్లో ఒకళ్ళిద్దరు ఇప్పుడే బయలుదేరి వెళ్ళి, వీరపుర సైనికుల నాయకుడి దగ్గరకుపోయి, మనమంతా ఆ బిలంలో దాక్కుని వున్నామని చెప్పాలి. వాళ్ళు మనను వధించేందుకు ఆవేశంతో బిలంలో ప్రవేశిస్తారు. అప్పుడు..."అంటూ, ఆగి గురుభల్లూకుడితో, "భల్లూకా! నీ శిష్యులు నీ మాటను జవదాటని తత్వంగలవాళ్ళా, లేక తమ ప్రాణాలు కాపాడుకునేందుకు గురుద్రోహానికి సైతం ఒడిగట్టే రకమా?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే గురుభల్లూకుడు ఉద్రేకపడిపోతూ, "అయ్యా, నేనాజ్ఞాపిస్తే వాళ్ళు కొండశిఖరం మీదినుంచయినా కిందికి దూకేస్తారు. ఇక్కడ అంత పెద్దకొండ లేదుగనక, ఆ కనబడే చెట్టు చిటారుకొమ్మ మీది నుంచి కిందికిదూకుమని అజ్ఞాపిస్తాను," అన్నాడు.

జీవదత్తుడు వారించే లోపలే, ఒక ఎలుగ్గొడ్డువాడు పరిగెత్తుకుంటూ పోయి, నూరడుగుల ఎత్తున వున్న ఒక చెట్టుపైకి పాకి, అక్కణ్ణించి, "గురుభల్లూకా, ఇదే నీ ప్రియ శిష్యుడి తుది నమస్కారం!"అంటూ కేక పెట్టి, చేతిపట్టు వదిలి, తలకిందులుగా నేల మీదికి పడసాగాడు. (ఇంకావుంది)



# రాజనర్తకి చిత్రపటం

పూర్వం అవంతీ నగరంలో సుహర్షుడు అనే యువచిత్రకారుడుండేవాడు. నగరంలో ఎంతోమంది అనుభవజ్ఞులైన చిత్రకారులున్నా, సుహర్షుడి చిత్రకళా నైపుణ్యాన్ని ధనికులైన వర్తకులూ, రాజబంధువులూ ఎక్కువగా ప్రశంసించేవారు. అతడు ఎవరి చిత్రాన్ని చిత్రించినా, ఆయా వ్యక్తులు తమ చిత్రాన్ని గురించిన బాగోగులు వెల్లడించినప్పుడు వాళ్ళకు బాధ కలగకుండా సున్నితంగా జవాబులిస్తూండేవాడు.

సుహర్షుడి ఖ్యాతి విని, ఒకసారి రాజనర్తకి భాసురాంగి అతడితో చిత్రాన్ని గీయించుకుని, అతడి నైపుణ్యాన్ని మెచ్చుకుంటూ, "రాజుగారితోపాటు స్త్రీ సౌందర్యం, నాట్యకళ గురించి క్షుణ్ణంగా ఎరిగిన ఎందరో పండితులు నన్ను జగదేకసుందరి అంటూ అభివర్ణించడం, కేవలం మెచ్చుకోలుకాదు. నీ చిత్రంద్వారా వాళ్ళ పొగడ్త నిజమని, ఇప్పటికి నేను గ్రహించాను!" అన్నది.

ఆ తర్వాత పది సంవత్సరాలు గడిచాక భాసురాంగి తన చిత్రాన్ని గీయమని మరొకసారి సుహర్షుణ్ణి కోరింది. అతడు బాగా శ్రమించి నెలరోజులకు ఆమె చిత్రాన్ని పూర్తిచేశాడు.

భాసురాంగి, ఆ చిత్రాన్ని ఏవగింపుగా చూస్తూ, "సుహర్షా! ఆశ్చర్యంగా వుంది; ఇది నా చిత్రపటమా? నా ఈ రూపాన్ని చూసేనా ఆ అంతమంది నన్ను జగదేకసుందరి అని పొగిడింది!" అన్నది.

దానికి సుహర్షుడు ఎంతో శాంతంగా, "అమ్మా, భాసురాంగీ! ఆనాడు నీ చిత్రాన్ని గీసినప్పుడు, నా వయస్సు ఇప్పటికన్న పదేళ్ళు తక్కువ," అన్నాడు.



బేతాళ కథలు

# సన్యాసి వరాలు!

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఈ అపరాత్రివేళ, స్వార్థంకొద్దీ ఏవైనా అపూర్వశక్తులు సంపాయించాలని ఇంత శ్రమపడుతున్నావో, లేక ఇతరులకు మేలుచేయాలన్న ఉదారగుణంతో ఇన్ని ఇక్కట్లను ఓర్చుకుంటున్నావో తెలియడంలేదు. కానీ, ఈ అపూర్వ అలౌకికశక్తుల ప్రభావం కొన్ని సందర్భాలలో చిత్రవిచిత్రంగా వుంటుంది. ఇందుకు ఉదాహరణగా శంకరుడు, కాశీపాదుడు అనేవాళ్ళకథ చెబుతాను,



శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం వరాళదేశంలోని ఒక పల్లె గ్రామంలో, ధర్మపాలుడనే ఒక చిన్న రైతు వుండేవాడు. అతడికి శంకరుడనే ఒక కొడుకుండేవాడు. తల్లిలేని శంకరుణ్ణి, ధర్మపాలుడు అల్లారుముద్దుగా పెంచాడు. ఆ ముద్దుమురిపాలతో వాడికి చదువు సంధ్యలు ఏమాత్రం అబ్బకపోగా, వల్లమాలిన పనిబద్ధకం కూడా తోడైంది. పెళ్ళిచేస్తే కొడుకు దారిలోకి వస్తాడని ధర్మపాలుడు, శంకరుడికి, దూరపుబంధువుల పిల్ల కనకవల్లితో పెళ్ళి జరిపించాడు.

అయితే, భార్య కనకవల్లి ఎన్ని ప్రయత్నాలు చేసినా శంకరుడిలో మార్పు రాలేదు. వాడు కడుపునిండా తిని, అది అరిగేదాకా ఊరంతా తిరిగి వస్తూండేవాడు. దానితో బాగా విసిగిపోయిన కనకవల్లి, శంకరుడి మీదా, అటువంటి కొడుకును తనకు అంటగట్టిన మామ ధర్మపాలుడిమీదా అమితమైన కసి పెంచుకుని, అనుక్షణం గట్టిగా అరుస్తూ, వాళ్ళను సాధించడం ప్రారంభించింది.

తర్వాత కొన్నాళ్ళకు ధర్మపాలుడు పోయాడు. అప్పటినుంచీ శంకరుడిపాట్లు రెట్టింపు అయ్యాయి. కనకవల్లి గయ్యాళితనం రోజు రోజుకూ పెరగసాగింది. అయినా శంకరుడిలో మాత్రం ఎలాంటి మార్పూ రాలేదు.

ఒకరోజున, పట్నంలో స్థిరపడిన శంకరుడి చిన్ననాటి స్నేహితుడొకడు అతణ్ణి చూడ వచ్చాడు. శంకరుడు భార్యతో, ''ఈ పూట నా స్నేహితుడికూ్కడా వంటచెయ్యి,'' అన్నాడు.

ఆ మాట వింటూనే కనకవల్లి తాటి ప్రమాణాన శంకరుడిమీద విరుచుకుపడి, ''చిల్లిగవ్వ సంపాయించలేని నీకు, వండి వడ్డించడమే దండగపని! ఇప్పుడేమో నీ స్నేహితుడికూ్కడా వంట చెయ్యమంటున్నావు. దారేపోయే దానయ్యలకు విందులు చేయడానికిది ధర్మసత్రం కాదు,'' అన్నది చేతిలోని పులుసు గరిటెను తిప్పుతూ.

అరుగుపై కూర్చున్న శంకరుడి స్నేహితుడు, కనకవల్లి జవాబుకు హడలిపోయి, అప్పటికప్పుడే వెళ్ళిపోయాడు.

స్నేహితుడు అలా వెళ్ళిపోవడం ఎంతో అవమానం అనిపించి, అప్పటికే భార్య గయ్యాళి తనంతో విసిగివున్న శంకరుడు, ఇల్లు వదిలి బయలుదేరాడు.

వాడు పల్లెకు అల్లంత దూరంలోవున్న అడవికి అడ్డంపడి చాలాదూరం నడిచాడు. ఆ సరికి చీకటిపడబోతున్నది. అంతలో, ''ఎవరు నువ్వు? చీకటి కమ్ముకుంటున్నది. అడవిలో ఈ సమయంలో ఇంకా ముందుకు పోవడం ప్రమాదం!'' అన్న మాటలు వినిపించి, శంకరుడు అటుకేసి తిరిగి చూశాడు.

దాపుల ఒక ఎత్తయిన రాళ్ళగుట్టమీద, ఒక సన్యాసి కూర్చుని వున్నాడు. శంకరుడు గబగబా ఆయనదగ్గరకు వెళ్ళాడు. సన్యాసి ముఖంలో ఏదో తేజస్సు కనిపించింది, శంకరుడికి.

శంకరుడు, సన్యాసి కాళ్ళ దగ్గర కూలబడి, భార్య గయ్యాళితనం కారణంగా తను పడుతున్న కష్టాలన్నీ వెళ్ళబోసుకుని, ''స్వామీ! ఇక నాలో ఆ గయ్యాళి భార్యతో వేగే ఓపికలేదు. ఆవిడ గయ్యాళితనం పోగొట్టే భారం తమదే. అలా కానప్పుడు, తమకు పరిచర్యలు చేస్తూ, అడవిమధ్య ఈ రాళ్ళగుట్టమీద తమతోనే వుండిపోతాను,'' అన్నాడు.



సన్యాసి, శంకరుడికేసి ముందు చిరుకోపంగాచూసి, తర్వాత చిరునవ్వు నవ్వి, ఒక క్షణకాలం తలాడించి కళ్ళుమూసుకుని, పక్కనేవున్న కమండలంలోని నీళ్ళు చేతిమీద ఒంపుకుని, '' ఆ కనకవల్లి గయ్యాళితనం సమూలంగా నశించాలి!'' అన్నాడు నీళ్ళను నేలమీదికి జారవిడుస్తూ.

తర్వాత సన్యాసి శంకరుడితో, ''నాయనా, ఈ కమ్ముకుంటున్న చీకట్లో ఇంకా అడవిలోకి వెళ్ళడం ప్రమాదంకాని, బయటికి పోవడంలో ఎలాంటి ఇబ్బందీ వుండదు. ఇప్పుడే తిన్నగా ఇంటికిపోయి, ఆ గయ్యాళి కనకవల్లి తీరు ఎలావున్నదో గమనించు,'' అన్నాడు.

శంకరుడు సన్యాసి పాదాలు తాకి, ఇల్లు చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. కనకవల్లి, శంకరుణ్ణి గుమ్మం ముందుచూస్తూనే వెళ్ళి కాళ్ళమీదపడి, ''నన్ను క్షమించండి! ఇన్నాళ్ళుగా అనరాని మాటలతో మిమ్మల్ని వేధించాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు,''అన్నది కళ్ళనీళ్ళతో.

శంకరుడి ఆనందానికి అంతులేదు. వాడు జరిగినదంతా భార్యకు చెప్పి, ''నీలో వచ్చిన మంచి మార్పుకు కారణం, ఆ సన్యాసి ఇచ్చిన వరం!'' అన్నాడు.

ఆ మాటలు విని ఆశ్చర్యపోయిన కనకవల్లి, ''చెప్పరేం మరి! దేవతలు



వరాలిచ్చేకాలం చెల్లిపోయి, సన్యాసులు వరాలిచ్చే కాలం వచ్చిందన్నమాట! ఎవరి దైతేనేం వరం వరమే!'' అంటూ తన చేతుల కేసి కొద్దిసేపు పరీక్షగా చూసుకుని, ''నా శరీరపు రంగు బాగా మెరుగవడంతోపాటు, కాస్త స్థూలం కూడా తగ్గేట్టు, ఆ సన్యాసిని వరం అడిగి రండి,'' అన్నది.

చేసేదిలేక మర్నాడు శంకరుడు మళ్ళీ సన్యాసిదగ్గరకు వెళ్ళి, భార్య అందంగా మారే వరం సంపాయించి, ఇల్లు చేరేసరికి, మిరు మిట్లుగొలిపే అందచందాలతో స్వాగతం పలికింది, కనకవల్లి.

మరుసటి రోజు ఆమె, శంకరుడితో, ''ఎన్ని మంచి కూరగాయలూ, ఆకు కూరలూ వున్నా, నాకు రుచిగా వంట చేయడం చేత గాదు. ఇది మా ఇంటి ఆడపడుచులంద రికీ, పూర్వం ఓర్వలేనివాళ్ళెవరో ఇచ్చిన శాపం. సన్యాసిని అడిగి, నేను రుచిగా వంటచేయగల వరం సంపాయించుకు రండి,'' అన్నది.

శంకరుడు అయిష్టంగానే సన్యాసి దగ్గరకు వెళ్ళి, ఆ వరంకూడా సంపాయించుకు వచ్చాడు.

ఒక వారం రోజులు గడవనిచ్చి కనక వల్లి,శంకరుడితో, ''నాకు అందచందాలు వచ్చినై. కమ్మగా వంట చేయగల శక్తీ అబ్బింది, అయినా ఏం లాభం! మన పేదరికం మాత్రం వదిలిందికాదు. మీరు మరొకసారి పోయి, మనకు సర్వసంపదలతో సుఖంగా జరిగిపోయే వరం కోరి రండి,'' అన్నది.

ఈసారి శంకరుడు కాస్త విసుక్కుంటూనే అడవికి వెళ్ళాడు. కానీ అక్కడ రాళ్ళగుట్ట మీద సన్యాసి కనిపించలేదు. వాడు చుట్టుపక్కల చాలా దూరం వెతికి చూసి నిరాశగా ఇంటిదారి పట్టాడు. వాడు పల్లె మొగలో వున్న పూటకూళ్ళ బస ముందుకు రాగానే, ''నీ సమస్యలన్నీ తీరిపోయాయి కదా? ఇప్పుడు సంతోషంగా వున్నావా, శంకరా?'' అంటూ ఒకతను పలకరించాడు.

గడ్డం తీసివేయడంతో శంకరుడికి, సన్యాసిని గుర్తించడం వెంటనే సాధ్యపడిందికాదు. వాడు ఆయన్ను గుర్తించగానే ఆశ్చర్యంతో, ''స్వామీ, ఇదేమిటి? మీ గడ్డం, కాషాయ వస్త్రాలూ ఏమయినై? '' అని అడిగాడు.

దానికి సన్యాసి నవ్వి, ''నా పేరు కాశీ పాదుడు. ఎవరో గొప్ప వివేకి చెప్పినట్టు, భార్య అనాకారితనం భరించడం అతి సులభం; గయ్యాళితనం భరించడం మహాకష్టతరం. నా భార్యలోవున్న ఈ రెండు లక్షణాలూ భరించ

లేక, నేను సన్యాసం స్వీకరించాను. అయితే, ఆరేళ్ళ ధ్యానఫలంగా వాక్శుద్ధి కలిగి, నేనన్న మాటలు ఫలించి నీ కాపురం చక్కబడింది. అది చూశాక, నా కాపురాన్ని కూడా చక్కదిద్దు కోవచ్చునన్న విశ్వాసం కలిగి, కాషాయం విసర్జించి, మా ఊరికి బయలుదేరాను,'' అన్నాడు.

ఇది విన్న శంకరుడు నిలువునా కుప్ప కూలిపోతూ, ''స్వామీ! ఆరేళ్ళకాలంగా ధ్యానంలో వున్నారు. మరొక్క రోజంటే ఒక్కరోజు - ఆ ధ్యానం కొనసాగిస్తే, మీ సొమ్మేం పోయేది? మీరు మాకు సర్వసంప దలతో సుఖంగా బతికే వరం ఇస్తారన్న కొండంత ఆశతో, ఆ కారడవిలోని రాళ్ళ గుట్ట దగ్గరకు వెళ్ళి చూసి మీరు కనిపించక పోయేసరికి నిరాశతో ఇలా తిరిగి వస్తున్నాను,'' అన్నాడు.



శంకరుడి మాటలకు సన్యాసి కాళీ పాదుడు పెద్దగా నవ్వి, ''శంకరా! కష్టేఫలీ అన్నారు పెద్దలు. బద్ధక పిశాచిని దూరంగా తరిమి, చేతనైన పనిలో కష్టించడమే, సుఖంగా బతికేందుకు మార్గం. మళ్ళీ ఏదో ఒకనాడు కలుసుకుందాం. ఇక్కడికి మా ఊరు చాలాదూరం. చీకటిపడకముందే ఇల్లు చేరాలి,'' అంటూ అక్కణ్ణించి కదిలాడు.

కాళీపాదుడు తన ఊరు చేరేసరికి బాగా చీకటిపడింది. అతడు ఉత్సాహంగా తన ఇంటిని సమీపించాడు. ఆ సమయంలో తెరిచివున్న కిటికీలోంచి అతడి భార్య బాలామణి, పదేళ్ళ కూతురునూ, ఎనిమి దేళ్ళ కొడుకునూ కసురుకుంటూ అంటున్న మాటలు అతడికి వినిపించినై:

''కట్టుకు పోగలిగినంత ఆస్తిపాస్తుల్ని, మీ తాత వదిలిపోయాడు; అయినా ఏం లాభం! వాటిని కాపాడే నాథుడు లేడు. సరైన అదుపు లేక మీకు చదువులు అబ్బ డంలేదు. మరి ఐదారేళ్ళలో మీ పెళ్ళిళ్ళు. ఇన్ని భారాలు నేను మోయగలనా! మీ నాన్న కిరాతకుడు! నేను గయ్యాళినే కావచ్చు. లోకంలో గయ్యాళి భార్యల భర్తలందరూ ఇల్లొదిలి సన్యాసుల్లో కలిసిపోతున్నారా? ఆ లెక్కన కోపదారులైన భర్తలున్న భార్య లందరూ ఏ సన్యాసుల్లో కలవడమో లేక ఏ నూతిలోనో దూకి చావడమో చేయక తప్పదు. ఛీ!''

ఆ తర్వాత ఏదో కంచులోటా గోడకు ఠపీమంటూ కొట్టుకున్న పెద్ద శబ్దమైంది. కాళీపాదుడు వెనుదిరగబోయి ఒక క్షణం ఆగి, తర్వాత మూసివున్న తలుపు దగ్గరకు

నడిచి, "బాలా! నేను తిరిగి వచ్చాను, తలుపు తియ్యి," అంటూ తలుపుమీద కొట్టాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శంకరుడు ఏ శ్రమా ప్రయాసల్లేకుండానే, తన భార్య గయ్యాళితనాన్ని పోగొట్టేందుకు, సన్యాసి కాళీపాదుడి నుంచి సాయంపొంది, తన సమస్యకు పూర్తి పరిష్కారం సాధించాడు. కానీ, తన ఆరేళ్ళ ధ్యానంద్వారా వాక్శుద్ధిని పొందిన కాళీపాదుడికి మాత్రం, తన భార్య గయ్యాళి తనం నుంచి విముక్తి కలిగినట్టు లేదు. ఇలా ఎందుకు జరిగింది? రోగికి తన చికిత్సద్వారా వ్యాధినివారణ చేసిన వైద్యుడు, తనకున్న అదే తరహా వ్యాధిని చికిత్సద్వారా నయం చేసుకోలేక పోవడం వింతల్లో వింత కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సన్యాసి కాళీపాదుడికి, తనసన్యాసం మీదా, ధ్యానం మీదా మొదట్లో అంతగా నమ్మకం వున్నట్టు కనబడదు. ఐతే, అతడు తన మాటలు శంకరుడికి మంచి ఫలితాన్నిచ్చిన తర్వాత, తనకు వాక్శుద్ధి లభించిందని గ్రహించాడు. ఆ కారణంగానే అతడు, అడవిలో తన ధ్యానానికి స్వస్తి పలికి, తన భార్య గయ్యాళితనాన్ని కూడా పోగొట్టి, తిరిగి గృహస్థజీవితంలో కుదురుకుందామని ఇంటికి బయలు దేరాడు. కానీ, అతడి ధ్యాన వాక్శుద్ధులు, ఆమె మీద ఏమాత్రం ప్రభావం చూపినట్టు లేదు. ఇల్లు చేరి, ఆమె గయ్యాళి మాటలు విని, తిరిగి అడవికి పోదామనుకున్న అతడికి --ఆమె, భార్యల గయ్యాళితనాన్ని గురించీ, భర్తల కోపదారితనాన్ని గురించీ అన్న మాటల్లో ఎంతో సత్యమున్నట్టు తోచింది. అందువల్లనే తలుపుకొట్టి భార్యను కేక వేశాడు. అతడు భార్య విషయంలో విఫలుడవడానికి ముఖ్యకారణం; అతడిలో తన ధ్యానశక్తిని పరుల ప్రయోజనానికి కాక, స్వప్రయోజనానికి ఉపయోగించుకోవాలన్న స్వార్థచింతన కలగడం," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం : మాచిరాజు కామేశ్వరరావు రచన]



# భారత సంస్కృతి - చరిత్ర

ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

## 21. ప్రకృతిలో దైవ దర్శనం!



సందీపుడికీ, శ్యామలకూ అది మరపురాని రోజు. తాతయ్య దేవనాథుడితో కలిసి పట్టణానికి సమీపంలోవున్న అందమైన ప్రదేశానికి వెళ్ళారు. చిన్న సరస్సు, దానికి ఆనుకుని తీర్చిదిద్దిన చిత్రంలాగా చిన్న కొండ ఉన్న సుందర ప్రాంతం అది. అన్నాచెల్లెళ్ళతో పాటు వాళ్ళ స్నేహితులు కూడా రావడంతో రోజంతా సంతోషంగా పరిసర ప్రాంతాలను తిరిగి చూశారు.

వాతావరణం ఎంతో ఆహ్లాదంగా ఉంది. చుట్టు పక్కల చెట్లన్నీ రకరకాల రంగుల పుష్పాలతో కళకళ లాడుతున్నాయి. సూర్యుడు బంగారు బంతిలా పడమటి కొండచాటుకు చేరుకుంటున్నాడు. ఆ ప్రశాంత గంభీర వాతావరణంలో అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూస్తూ "ఆహా! దివ్యమైన దృశ్యం కదూ!" అన్నది శ్యామల.

"ఆహా! దివ్యం అనే చక్కని పదం వాడావు. చాలా బావుంది తల్లీ! మన పెద్దలు ప్రకృతినే దివ్య స్వరూపంగా భావించారు. అది మన సంస్కృతిలోని ఒక విశిష్ట అంశం. మనిషి మానసిక చైతన్య పరిధిని విస్తృతపరచే విశాల దృక్పథం అది. ఆ దృక్పథం కలిగి ఉన్నందువల్లే మన ఋషులు హిమాలయాలను దివ్యాత్మగా అభివర్ణించారు. మంచుకొండల మధ్య కూడా దేవాలయాలను ఏర్పాటుచేశారు. హిమాలయ శిఖరాలలోని కైలాసగిరిని పరమశివుడి నివాస స్థానంగా కొనియాడారు," అన్నాడు దేవనాథుడు.

"భక్తులు ఎన్నో శ్రమలకు ఓర్చి అలాంటి దేవాలయాల యాత్రకు వెళుతూఉంటారు. అలాంటి యాత్రీకులను మాటువేసి హతమార్చ డం దారుణం కదా! మొన్న జూలైలో అమరనాథ్

విశ్వావసు



యాత్రకు వెళ్ళిన భక్తులకు అలాంటి దుర్ఘటనే ఎదురయింది!'' అన్నాడు సందీపుడి మిత్రుడు.

''మనుషులమధ్యే, విషసర్పాల్లాంటి దుర్మా ర్గులు మానవరూపాలతో మసలుతూన్నారు. వాళ్ళ దారుణ చర్యలు ఇంకా ఎంతకాలం కొనసాగు తాయో;మనుషులుగా తమను సమర్థించుకునే మనస్సాక్షి వాళ్ళలో ఎప్పుడు ఉదయిస్తుందో ఏమో ఆ భగవంతుడికే తెలియాలి!'' అన్నాడు దేవనాథుడు బాధతో నిట్టూరుస్తూ.

''అమరనాథ్ దేవాలయం ఎలాంటిది? ఆ దేవాలయంలో ఉన్న దేవుడి పేరేమిటి తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.

''మనిషి ప్రకృతిపట్ల ప్రదర్శించే భక్తి భావా నికి పరిపూర్ణ ఉదాహరణ అమరనాథ్ దేవాల యం!'' అంటూ, దేవనాథుడు తనకేసి ఆసక్తితో చూస్తూన్న పిల్లలకు హిమాలయాలలోని అమర నాథ్ దేవాలయం గురించి వివరించ సాగాడు:

మంచుకొండలమధ్య సముద్రమట్టానికి దాదాపు 400 మీ. ఎత్తులో వెలసిన ఈ దేవా లయం వేలాది సంవత్సరాలుగా ప్రసిద్ధి గాంచింది. అయితే, ఒకప్పుడిది కాలగర్భంలో కనుమరుగైపోయింది. ఒక గొర్రెల కాపరి తప్పిపోయిన గొర్రెను వెతుక్కుంటూ వెళ్ళి, ఉన్నట్టుండి ఒక వింత గుహనూ, దాని లోపల పూర్తిగా మంచుతో ఏర్పడిన శివలింగ రూపాన్నీ చూశాడు. చంద్రుడి వృద్ధి క్షయాలకు అనుగుణంగా ఆ లింగం పెరుగుతూ, తరుగుతూ ఉంటుంది!

గొర్రెలకాపరి తాను చూసిన శివలింగం గురించి కాశ్మీర రాజుకు తెలియజేశాడు. అలాంటి గుహ ఒకటి ఉందని ఆస్థానపండి తులకు తెలుసుగానీ, అది ఎక్కడ ఉందో; ఆ చోటికి ఎలా వెళ్ళాలో మాత్రం వారికిస్పష్టంగా తెలియదు. కొన్ని తరాలనుంచి ఆ గుడిని చూసినవారంటూ లేరు. అయితే ఆ ఆలయా నికి సంబంధించిన పురాణకథ మాత్రం పండితులకు తెలుసు:

ఒకానొకప్పుడు పార్వతీదేవి, తన భర్త పరమశివుడు మెడలో ధరించిన కపాలమాలను చూసి, దానిని ఆయన ధరించే కారణం అడి గింది. పరమశివుడు మందహాసంచేసి, ''ఇవి నీ పూర్వజన్మలకు సంబంధించిన కపాలాలు. నువ్వు మరణించినప్పుడల్లా, నీ కపాలాన్ని మెడలో మాలగా ధరిస్తూ వస్తున్నాను,'' అన్నాడు.

''నేను ఇన్ని జన్మలెత్తానుకదా! మరి నీకు మాత్రం జనన మరణాలు ఎందుకు లేవు?'' అని అడిగింది పార్వతి.

''అది దివ్య అమరత్వ రహస్యం. దానిని నీకూ తెలియజేస్తాను. అది తెలుసుకుంటే నీకూ మరణ భయం ఉండదు. అయితే నేను చెప్పే రహస్యం నువ్వు మాత్రమే వినాలి. దరిదాపుల్లో మరే ప్రాణీ ఉండకూడదు!'' అన్నాడు పరమశివుడు.

అటువంటి చోటుకోసం శివగణాలు వెతికి,

ఆఖరికి ఒక గుహను కనుగొన్నారు. శివపార్వతులు ఆ గుహలోకి ప్రవేశించారు. శివుడు పార్వతిని పక్కన కూర్చోబెట్టుకుని అమరత్వ రహస్యాన్ని వినిపించసాగాడు. దానిని వింటూ వింటూ పార్వతి కొంతసేపటికి నిద్రలోకి జారుకున్నది. శివుడు ఏకధాటిగా ఏకాగ్రచిత్తంతో వివరిస్తూ వెళ్ళాడు. పరిసరాలను గమనించలేదు. అయితే, మరికొంతసేపటికి తాను చెబుతూన్నదానికి పార్వతి కాకుండా మరెవరో మెల్లగా ఊకొడుతున్నట్టు గమనించి శివుడు తలతిప్పి చూశాడు. అప్పుడే గుడ్డునుంచి వెలువడిన చిలుకపిల్ల రివ్వున గుహనుంచి వెలుపలికి ఎగిరిపోయింది. ఆ చిలుకే ఆ తరవాత వ్యాసముని కుమారుడైన శుకదేవుడిగా జన్మించింది!

శివుడు పార్వతికి అమరత్వ రహస్యాన్ని ఉపదేశించిన పుణ్యస్థలం అమరనాథ్‌దేవాలయం!

ఇక ఇప్పటి కథకు వద్దాం. గొర్రెలకాపరి చూపిన మార్గంగుండా రాజూ, పరివారం గుహ ప్రాంతానికి చేరారు. ఇది జరిగిందికూడా వెయ్యేళ్ళకు పూర్వం! నాటినుంచి యేటా వేలాదిమంది భక్తులు- మంచు కరిగి మార్గం సుగమంగా ఏర్పడినప్పుడు - ప్రకృతి సహజంగా ఏర్పడిన ఆ దేవాలయాన్ని దర్శిస్తున్నారు.

భక్తులు ఒక శుభదినాన పహాల్‌గాన్ శిఖరాలలో, దూద్‌గంగవంటి నదులలో ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ గమ్యంకేసి సాగుతారు. ఒకవిధంగా పరిసర ప్రకృతిలో అంతర్భాగమైపోతారు. అదే ఒక అపూర్వ అనుభవం. గుహ లోపల దివ్యాద్భుత శోభలు వెదజల్లే మంచు లింగాన్ని దర్శిస్తారు. అంతటితో యాత్ర పూర్తయి జన్మ తరించిన అనుభూతితో తిరుగు ప్రయాణమవుతారు!'' అని ముగించాడు దేవనాథుడు.

సూర్యుడు అస్తమించడంతో మసకమసక చీకట్లు సరోవరంచుట్టూ అలముకుంటున్నాయి. దివ్య సౌందర్యాన్ని గుర్తుచేసే ప్రకృతిని గౌరవించాలన్న ఉన్నతభావం నిండిన హృదయాలతో అందరూ తిరుగుప్రయాణానికి ఆయత్తమయ్యారు.

— (ఇంకావుంది)



## గుజరాత్ జానపద కథ

## గుజరాత్ : నాడు-నేడు

క్రీ.శ. ఐదవ శతాబ్దంలో హూణుల దండయాత్ర కారణంగా మధ్య ఆసియా నుంచి భారతదేశానికి పారిపోయి వచ్చి స్థిరపడిన 'గుజ్జర్' తెగ ప్రజల కారణంగా ఆ ప్రాంతానికి 'గుజ్జర్ రాష్ట్ర' అనే పేరు వచ్చింది. అదే కాలక్రమంలో 'గుజరాత్' అయింది.

అయినప్పటికీ గుజరాత్ చరిత్ర అంతకన్నా ప్రాచీనమైనది. అది క్రీ.పూ 2000 వరకూ వెళుతుంది. రాణ్ ఆఫ్ ఖచ్‌లో హరప్పా నాగరికత జాడలు బయటపడ్డాయి. భారతకాలంనాటి శ్రీకృష్ణుడు మధురా నగరాన్ని వదిలి సౌరాష్ట్ర పశ్చిమ సముద్రతీరం ద్వారకలో స్థిరపడినట్టు చెబుతారు.

1960 బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టం ఫలితంగా ఈనాటి గుజరాత్ రాష్ట్రం 1960 మే 15 వ తేదీ ఏర్పాటయింది. గుజరాత్ పశ్చిమాన అరేబియా సముద్రం, ఉత్తరాన పాకిస్తాన్; ఈశాన్యంలో రాజస్థాన్; ఆగ్నేయంగా మధ్యప్రదేశ్; దక్షిణంగా మహారాష్ట్ర సరిహద్దులుగా కలిగి ఉన్నది.

రాష్ట్ర వైశాల్యం 1,96,000 చ.కి.మీ. ఇది భారతదేశ వైశాల్యంలో 6.1 శాతం. 2001 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్ర జనాభా 5,05,96,992. ఇతర భారతీయ రాష్ట్రాలతో పోల్చినప్పుడు గుజరాత్ జనాభాలో పదవస్థానంలోనూ, వైశాల్యంలో తొమ్మిదవ స్థానంలోనూ ఉంటున్నది.

## తెలివి అమ్మబడును

ఒకానొకప్పుడు గుజరాత్ ప్రాంతంలోని ఒక రాజ్యంలో విపులుడనే యువకుడు ఉండేవాడు. విపులుడు పసివాడుగా ఉన్నప్పుడే వాడి తండ్రి మరణించాడు. తండ్రి విపులుడికి బతకడానికి ఆస్తి అంటూ ఏదీ వదిలి వెళ్ళలేదు. అయినా వాడు తండ్రి బతికి ఉన్నపుడు ఆయన దగ్గరే ఉండి, ఆయన వ్యాపారం చేసే పద్ధతులను గమనించి చాలా విషయాలు నేర్చుకున్నాడు. కొన్నాళ్ళకు అతనికి ఒక చక్కని ఆలోచన వచ్చింది.

విపులుడు తన తండ్రికి పరిచయమున్న కొందరు వ్యాపారుల దగ్గర కొంచెం అప్పుచేసి, అంగడి వీధిలో ఒక చిన్నకొట్టు ఏర్పాటు చేసుకున్నాడు. 'ఇక్కడ తెలివి అమ్మబడును' అని ఒకపలకమీద రాసి కొట్టుముందు తగిలించాడు.





## హస్తకళలు

ఆకర్షణీయమైన రంగురంగుల చేతి పనులకు గుజరాత్ ప్రసిద్ధి గాంచింది. వాటిలో కుట్టు, అద్దకం పనులు నిండిన బంధానీ లేదా బంధేజ్‌ను మరీ చెప్పుకుంటారు. దుస్తుల నాణ్యతకు గుజరాత్ చాలా ప్రసిద్ధి. ఆకర్షణీయమైన డిజైన్లతో వచ్చే పటోలా వస్త్రాలు; సూరత్‌కు చెందిన జరీపనులు; డిజైన్లతో వచ్చే మష్రూ దుస్తులు మొదలైన వాటిని గురించి ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

చాలక్, పలైయా, కాంగ్రి, టిక్కీ, కటోరీ మొదలైన సుప్రసిద్ధమైన డిజైన్లు ఈ రాష్ట్రానికి చెందినవే. దుస్తుల మీదా, చీరల మీదా మెరిసే అందమైన అద్దాలను అమర్చడంలో కచ్ ప్రాంతం చాలా ప్రసిద్ధిగాంచింది.



కొన్ని తెల్లకాగితాలు, కలం, సిరాబుడ్డి ముందు పెట్టుకుని కూర్చున్నాడు.

అక్కడున్న వ్యాపారులు తమదగ్గరున్న సరుకుల పేర్లు చెప్పి జనాన్ని పిలవడం పరిపాటి. అక్కడ రకరకాల వస్తువులు అమ్ముతారు. బంధేజ్,జరీ, ఉటోలా లాంటి విలువైన వస్త్రాలను విక్రయిస్తారు. బొమ్మలు,ఆటవస్తువులు,కుర్చీలు,ఊయలలు మొదలైనవాటినీ అమ్ముతారు. ఇంకా కొంచెం ముందుకు వెళితే,ఖమమ్ ధోక్లా, పధారా,ఖాండ్వి, వేయించినఫార్సాన్లులాంటి ఆహారపదార్థాలనూ, వేడివేడి జిలేబీ, దూధ్‌పాక్, శ్రీఖండ్ లాంటి తీపి తినుబండారాలనూ అమ్మేవాళ్ళు కనిపిస్తారు.

ఒకవైపు ఆహారధాన్యాలు, మరొకవైపు కూరగాయలు, పళ్ళుకూడా అమ్మేవాళ్ళున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే అక్కడ లేని వస్తువంటూ లేదు. చూడగలిగినవి, తాకగలిగినవి, రుచి, వాసన చూడ గలిగినవి అంటూ అన్నీ ఉన్నాయి. అయినా కంటికి కనిపించనిదాన్ని, ఆ మాటకువస్తే జ్ఞానేంద్రియాలకు అతీతమైన తెలివిని అమ్మకానికి పెట్టిన వింత వ్యక్తి ఎవరా అని ఆ పలకను చూసిన వాళ్ళందరూ ఆశ్చర్యపడసాగారు. కొందరైతే అతన్ని పిచ్చివాడికింద జమకట్టి ఊరుకున్నారు. అయితే, విపులుడు మాత్రం ఎవరేమన్నా నిరుత్సాహ పడకుండా రోజూ కొట్టుకు వెళ్ళి కూర్చుని, "తెలివి అమ్మబడును," "తెలివి అమ్మబడును," అని పదిమందికీ వినబడేలా చెబుతూ వచ్చాడు.

ఒకనాడు బుధునాధుడనే ఒక ధనికుడి కొడుకు అటుకేసి వచ్చాడు. అతని తండ్రి అతన్నెప్పుడు చూసినా 'తెలివిలేని దద్దమ్మ' అని తిడుతూ ఉండేవాడు. అతడు విపులుడి కొట్టుదగ్గరికి రాగానే ఆశ్చర్యంతో, "నిజంగానా? తెలివిని అమ్మడమే?" అని అడిగాడు.

విపులుడు, "అవును. ఇక్కడ నిజంగానే తెలివి అమ్మబడును," అని జవాబిచ్చాడు.

తన తండ్రిని సంతోషపెట్టడానికి చక్కని అవకాశం వచ్చినట్టు భావించి పొంగిపోతూ బుధునాధుడు, "గజం తెలివి ఖరీదు ఎంత?" అని అడిగాడు.

"తెలివిని గజాల లెక్కన అమ్మను. నాణ్యతను బట్టి దాని ధర ఉంటుంది," అన్నాడు విపులుడు.

దేన్నిగురించిగానీ అంతగా తెలియని బుధునాధుడు, "అలాగా! అయితే, నాకు రూపాయి ఖరీదుచేసే తెలివిని ఇవ్వు," అన్నాడు.

విపులుడు ఒక కాగితాన్ని అందుకుని, కలాన్ని సిరాలో ముంచెత్తి, "ఇద్దరు మనుషులు గొడవ పడుతున్నప్పుడు దగ్గరికి వెళ్ళి చూడవద్దు," అని రాసి అతడికిచ్చాడు.

బుధునాధుడు,, "చాలా సంతోషం!" అంటూ దానిని తీసుకుని మడిచి తలపాగాలో దాచుకుని, రూపాయి తీసి ఇచ్చి, చాలా చౌక బేరం అని మురిసిపోతూ ఇంటికి బయలుదేరాడు.

## ఉత్సవాలు-సంతలు

గుజరాత్ ఉత్సవాలకూ, సంతలకూ ప్రసిద్ధి గాంచింది. ఈ సందర్భంగా అహ్మదాబాదులో యేటా జనవరి 14 వతేదీ మకరసంక్రాంతి రోజున జరిగే బ్రహ్మాండమైన గాలి పటాల ఉత్సవాన్ని చెప్పుకోవాలి. ఈ పోటీల్లో పాల్గొనడానికి విదేశాలనుంచి కూడా తండోప తండాలుగా అభిమానులు రావడం ఇక్కడ గమనించతగ్గ విశేషం. ఆ తరవాత తార్నెతార్‌లోజరిగే త్రినేత్రేశ్వర్ మహాదేవ్ సంతను గురించి చెప్పాలి. మహాభారతంలోని ద్రౌపదీ స్వయంవరం ఇక్కడే జరిగిందని చెబుతారు.

రాజస్థాన్‌లో జరిగే సుప్రసిద్ధమైన జంతువుల సంత 'పుష్కర్ మేళా' లాగే ఇక్కడి సబర్మతి, వత్రక్ నదుల సంగమ ప్రాంతం 'వౌతా' లో యేటా జంతువుల సంత జరుగుతుంది. ముఖ్యంగా ఇక్కడ గాడిదల వ్యాపారం జోరుగా సాగుతుంది.

అయితే, ఇల్లుచేరి అతడు జరిగింది తండ్రికి చెప్పగానే ఆయన కోపోద్రిక్తుడైపోయి, "నీ మూర్ఖత్వానికిహద్దులేకుండా పోయింది. ఎవడో దొంగవెధవ తెలివిని అమ్ముతానంటే, దానిని నమ్మి నువ్వు మోసపోయావు. తెలివితేటలు డబ్బుపెట్టి కొనేవి కావని నీకు తెలియదా?" అని చీవాట్లు పెట్టాడు.

ఆయన అంతటితో వదలకుండా, కొడుకును వెంటబెట్టుకుని అంగడి వీధికి వెళ్ళాడు. కొడుకు విపులుణ్ణి చూపగానే, "నా కొడుకు అమాయకుడని గ్రహించి, వాణ్ణిమోసం చేస్తావా? ఇప్పుడే రాజు దగ్గరికివెళ్ళి, ప్రజలనుమోసం చేస్తున్నావని నీమీద ఫిర్యాదుచేసి, నీ పని పడతాను చూడు," అంటూ కోపంగా గద్దించాడు.

"ఈ చిన్నవిషయానికి ఇంత రాద్ధాంతం దేనికి? నా సరుకు నాణ్యత మీకు నచ్చలేదంటే, దాన్ని తిప్పి ఇచ్చేసి, నిక్షేపంగా మీ సొమ్ము మీరు పుచ్చుకోవచ్చు," అన్నాడు విపులుడు నిదానంగా.

తన కొడుకు మూర్ఖత్వంకొద్దీ చేసిన తప్పును ఇంత సులభంగా సరిదిద్దుకోవడానికి వీలవుతుందని ధనికుడు అనుకోలేదు.

"ఇదిగో నీ సలహా, తీసుకో," అంటూ ధనికుడు కాగితాన్ని విపులుడికేసి విసిరికొట్టాడు.

"నా తెలివిని తిప్పి ఇవ్వడం అంటే ఇదికాదు. నేను అమ్మిన తెలివి ఈ కాగితం ముక్కలో లేదు. అందులో నేను రాసిన సలహాలో ఉంది. నేను అమ్మిన తెలివిని ఎప్పుడూ ఉపయోగించననీ, మనుషులు గొడవపడుతూంటే, అక్కడే నిలబడి చూస్తూ ఉంటాననీ, నీ కొడుకు నాకు మాట ఇవ్వాలి. అదీ నా తెలివిని తిప్పి ఇవ్వడమంటే," అన్నాడు విపులుడు.

ఇంతలో అక్కడ గుమికూడిన నలుగురూ అతని మాటల్లో న్యాయం ఉందన్నారు. తనకొడుకు ఎప్పుడుగానీ, విపులుడు అమ్మినతెలివిని ఉపయోగించడని ధనికుడు అతనికి మాటఇచ్చి, రూపాయి పుచ్చుకుని కొడుకును తీసుకుని వెళ్ళిపోయాడు.



భించారు. వాళ్ళిద్దరిలో ఒకతె బుధునాధుణ్ణి చూసి, "ఈ గొడవంతా ఆరంభించింది, ఆవిడే. అందుకు నువ్వే సాక్షి!" అన్నది.

వెంటనే మరొక పరిచారిక, "నువ్వే నా సాక్ష్యం. ఆవిడే నా మీదికి వచ్చి మొదట నా జుట్టుపట్టి లాగింది. నువ్వే చూశావు కదా! అదేచెప్పాలి," అన్నది.

ఆ తరవాత రాణివాసంలో చేయవలసిన పనులు చాలా ఉన్నాయన్న సంగతి ఇద్దరికీగుర్తురావడంతో, వెంటనే తిరుగుముఖం పట్టారు. ఇరువురూ పట్టరాని ఆగ్రహంతో తమ రాణుల నివాసమందిరాలలోకి వెళ్ళారు.

ఆ రాజ్యాన్నేలేరాజుకు రూపమతి, తారామతి అని ఇద్దరు భార్యలు. ఇద్దరిమధ్యా పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. ఎప్పుడు చూసినా ఏవో గొడవలే. వాళ్ళేకాదు, వాళ్ళ పరిచారికలు కూడా సాకుదొరికితే చాలు కయ్యానికి కాలుదువ్వేవాళ్ళు.

ఒకనాడు బుధునాధుడు అంగడివీధిలో అటూ, ఇటూ చాలాసేపు తిరిగాడు. ఆ సమయంలో ఇద్దరి రాణుల పరిచారికలు ఇద్దరుకూడా అక్కడికి వచ్చారు. ఒకరిని చూసి ఒకరు మూతి విరుచు కుంటూ కూరగాయల అంగడికి వెళ్ళారు. ఇద్దరి చూపులూ ఒక్కసారిగా ఒక గుమ్మడికాయ మీద పడ్డాయి. ఇద్దరూ దానిని తమకే కావాలన్నారు. కొట్టువాడికి మతిపోయినంత పనయింది. "ఆ గుమ్మడికాయలో ఎలాంటి ప్రత్యేకతాలేదు. పక్కనే కావలసినన్ని గుమ్మడికాయలున్నాయి. వాటిలో ఒకటి తీసుకోండి, అనవసరంగా గొడవలెందుకు?" అని వాడు ఎంత నచ్చజెప్పినా వాళ్ళు వినిపించుకో లేదు. కొద్దిసేపటికల్లా ఒకరినొకరు తిట్టుకోసాగారు.

బుధునాధుడు మందమతే తప్ప, చాలా నిజాయితీపరుడు. అందువల్ల, తన తండ్రి విపులుడి కిచ్చినమాటను గుర్తుకు తెచ్చుకుని– ఇద్దరాడవాళ్ళ గొడవను అక్కడే నిలబడి చూడసాగాడు. అంతలో పరిచారికలమధ్య మాటలు ముదిరి, కొట్లాటకు దిగారు. ఒకరినొకరు కొట్టుకోవడం, గిచ్చుకోవడం ప్రారం

పరిచారికలు తమ రాణులకు అంగడి వీధిలో జరిగిన సంగతిచెప్పి, ఒకరిపై ఒకరు నిందలు వేసుకున్నారు. బుధునాధుడే వీటన్నిటికీ సాక్ష్యం అని అన్నారు. ఇందులోని నిజానిజాలు తేల్చడానికి రాజు బుధునాధుణ్ణి పిలుచుకురమ్మని భటులను ఆజ్ఞాపించాడు.

బుధునాధుడు పెద్ద చిక్కులో పడ్డాడు. వాడు ఎటుచెప్పినా ప్రమాదమే ముంచుకు వస్తుంది. "ఆడవాళ్ళ గొడవలు నీకెందుకురా? నీ దారిన నువ్వు రావలసిందేకదా? మతిమాలిన వాడా!" అని కొడుకును తిట్టడం తప్ప, ధనికుడు మరేమీ చేయలేకపోయాడు.

"విపులుడికి తిరిగి ఇచ్చిన తెలివిని ఉపయోగించననీ, ఏమైనా గొడవలుజరిగితే అక్కడే నిలబడి చూస్తాననీ విపులుడికి మనం మాట ఇచ్చాంకదా? మరి ఆ మాట తప్పవచ్చా?" అని తండ్రికి ఎదురు తిరిగాడు బుధునాధుడు.

మరొకమార్గం కనిపించక తండ్రీకొడుకులు, విపులుడి దగ్గరికివెళ్ళి సంగతి చెప్పి తరుణోపాయం

అడిగారు. అంతా విన్న విపులుడు, "నా దగ్గర మంచి సలహా ఉంది. అయితే, ధర కాస్త ఎక్కువ," అన్నాడు.

"ఫరవాలేదు. ఎంతో చెప్పు" అన్నారు తండ్రీ కొడుకులు.

"ఐదు వందల వెండి రూపాయలు!" అన్నాడు విపులుడు.

"అంత ధరా!" అని మొదట ఆశ్చర్యపోయినా, ధనికుడు సరే అనక తప్పలేదు.

"రాజు సమక్షానికి వెళ్ళి పిచ్చివాడిలా నటించు.



నువ్వు మాట్లాడేది ఏదీ రాజుకు అంతుబట్ట కూడదు. నోటికి వచ్చినట్టు మాట్లాడు. రాజు వదలిపెడతాడు. రాణులకు కూడా నీమీద కోపం ఉండదు," అన్నాడు విపులుడు బుధునాధుడితో.

ధనికుడు విపులుడికి ఐదువందల రూపాయలు చెల్లించాడు. బుధునాధుడు, విపులుడి సలహాను పాటించి రాజుదగ్గర పిచ్చివాడిలా నటించి, గండం నుంచి బయట పడ్డాడు.

అయితే, ఇల్లుచేరాక తండ్రీకొడుకులకు ఎదురుచూడని మరొక కొత్తసమస్య ఎదురయింది. బుధునాధుడు పిచ్చివాడు కాదనీ, కావాలనే పిచ్చి వాడిలా నటించి తననుమోసగించాడనీ రాజుకు తెలియవస్తే తమ గతి ఏమవుతుంది? తలుచుకుంటేనే ధనికుడి గుండె దడదడలాడసాగింది. తిన్నగా విపులుడి దగ్గరకి వెళ్ళి అతడి సలహా నాణ్యతను గురించి ఫిర్యాదు చేశాడు.

"సరే. నేను ఇచ్చినప్పుడు అది మంచి సలహా. సరిగ్గానే పనిచేసిందికదా? ఇప్పుడు మరొక ఐదు వందలు చెల్లించుకోండి. వేరొక మంచి సలహా చెబుతాను," అన్నాడు విపులుడు.

రాజుగారితో వ్యవహారం ఏం చేస్తాడుమరి? ధనికుడు అలాగే ఐదు వందలు తీసి ఇచ్చాడు.

"రాజుగారు సంతోషంగా ఉన్నప్పుడు, అసలు సంగతి చెప్పి, క్షమాపణలు చెప్పుకోండి. సమస్య సులభంగా పరిష్కారమవుతుంది! రాజు నవ్వేసి మిమ్మల్ని క్షమిస్తాడు. ఒక విషయం గుర్తుంచుకోండి. మీరు ఈ విషయం చెప్పేప్పుడు రాజుగారు సంతోషంగా ఉండాలి. అది చాలా ముఖ్యం!" అన్నాడు విపులుడు.

బుధునాధుడూ,అతడి తండ్రీ విపులుడు చెప్పినట్టే తు.చ. తప్పకుండా చేశారు. వాళ్ళమాటలు విని రాజు పగలబడి నవ్వాడు. వాళ్ళను క్షమించాడు. విపులుడిపథకం పారింది. అయితే రాజుకు వాళ్ళకు తెలివిని అమ్మిన యువకుణ్ణి చూడాలన్న ఉత్సాహం కలిగింది. విపులుణ్ణి వెంటనే పిలిపించాడు.

విపులుడు రాగానే రాజు, "నువ్వు తెలివిని అమ్ముతావని తెలియవచ్చింది. నాకు ఎలాంటి తెలివిని అమ్మగలవు?" అని అడిగాడు.

"ప్రభువులు మన్నించాలి. నేను విక్రయించే వివేకం ధర కాస్త ఎక్కువ," అన్నాడు విపులుడు వినయంగా.

"అలాగా! ఎంత ధర పలుకుతుందేమిటి?" అని అడిగాడు రాజు నవ్వుతూ.

"ఐదువేలు! తమకు తగిన తెలివి ధర ఐదు వేలు ప్రభూ!" అన్నాడు విపులుడు.

"నాణ్యత నిజంగానే బావుంటే, అంత ధర చెల్లించడానికి నాకు ఏమాత్రంఅభ్యంతరంలేదు," అన్నాడు రాజు.

విపులుడు ఒక కాగితం తీసుకుని, అందులో, "ఏపనైనా సరే చేసే ముందు సావధానంగా ఆలో చించండి!," అని రాసి రాజుకు ఇచ్చాడు.

రాజుకు ఆ సలహా బాగా నచ్చింది. విపులుడికి ఐదువేల రూపాయలు ఇచ్చి పంపాడు. అంతే కాదు. రాజభవనంలో తన చూపుపడే చోటల్లా, అంజార్ చిత్రాల పక్కనా, విసన కర్రల మీదా మట్టి పాత్రల మీదా ఆ సలహాను రాయించాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళ తరవాత, రాజు అస్వస్థ తకు లోనయ్యాడు. రాణీ రూపమతి, దుర్మార్గుడైన మంత్రి కలిసి, రాజు అడ్డు తొలగిం చాలనుకున్నారు. రాజవైద్యుడికి లంచం ఇచ్చి, ఔషధంలో విషం కలపమన్నారు. వైద్యుడు అం దుకు సరేనన్నాడు. రాజు, వైద్యుడి చేతినుంచి అందుకున్న ఔషధాన్ని సేవించడానికి ముందు గోడమీద రాయబడివున్న, 'ఏ పనైనాసరే, చేసేముందు సావధానంగా ఆలోచిం చండి!' అన్న సలహా ఆయనకు కనిపించింది. ఆ మాట లోని అద్భుత సత్యానికి అచ్చెరువొందిన రాజు, ఔషధాన్ని తాగకుండా, ఆ మాటను గురించి ఆలోచిస్తూ దూరంగా చూడసాగాడు.

రాణీ, మంత్రీ బెదిరింపుల కారణంగా పాపానికి ఒడిగట్టినప్పటికీ, అపరాధ భావంతో తల్లడిల్లుతూన్న వైద్యుణ్ణి రాజుగారి గంభీర మౌనం మరింత కలవర పెట్టింది. రాజుకు ఔషధంపట్ల అనుమానం తలెత్తిందని భావించి వైద్యుడు హడలిపోయాడు. గుండె దడదడ లాడసాగింది.పట్టుబడక ముందే తప్పు ఒప్ప కోవడం క్షేమమనిపించింది. వెంటనే రాజు పాదాలపైబడి, "క్షమించండి, ప్రభూ!" అని కన్నీళ్ళు కార్చసాగాడు.



రాజు మొదట ఆశ్చర్యపోయాడు. జరిగింది సాంతం గ్రహించాక అమితా గ్రహం చెందాడు. రాణినీ,మంత్రినీ పిలిచి విచారణ జరిపి - వాళ్ళిద్దరినీ, వైద్యుణ్ణీ రాజ్యం నుంచి బహిష్కరించాడు.

ఆ తరవాత రాజు విపులుణ్ణి పిలి పించి, అతన్ని తనమంత్రిగా నియమించు కున్నాడు. విపులుడి వివేకవంతమైన సల హాల ప్రకారం ప్రజలకు ఏ కొరతాలేకుండా రాజ్యాన్ని చిరకాలం పాలించాడు.

[ఆధారం : ఏ.కె. రామానుజం - భారతదేశ జానపద కథలు]

## పర్యాటక ప్రదేశాలు

మీరు గుజరాత్‌కు వెళ్ళినట్టయితే, శ్రీకృష్ణుడి నివాసస్థానమని చెప్పబడే ద్వారకను తప్పక సందర్శించండి. ఈనాటి ద్వారకను ఈస్థలంలో వెలసిన ఆరవ నగరంగా చెబుతారు. పూర్వపు ఐదు నగరాలూ సముద్రంలో మునిగిపోయాయి. ఇక్క డున్న ద్వారకాధీశుడి దేవాలయం 2,500 సం. పూర్వంనాటిదని చెబుతారు.

కచ్‌లోని లోథల్, హరప్పా నాగరికత వెలసిన ప్రాంతంగా ప్రఖ్యాతిగాంచింది. మనదేశంలోని అతి ప్రాచీన నాగరికత వెలసిన నివాస ప్రదేశాలు హరప్పా, లోథల్ ప్రాంతాలు.

# కథకళి!
## భారతీయ నృత్యాలు



దేవుళ్ళు, దేవతలు; రాక్షసులు, గంధర్వులు ఇలా రకరకాల వేషాలు ధరించిన కళాకారులు ఆశ్చర్యం కలిగించే వేగంతో నృత్యం చేస్తారు. వేదికపై ఒకే ఒక పెద్ద దీప స్తంభం. మసకవెలుతురు ప్రసరిస్తూన్న గంభీర వాతావరణంలో ఆకర్షణీయమైన రంగురంగుల దుస్తులు ధరించి, విచిత్రమైన ముఖాలంకరణలు చేసుకున్న కళాకారుల నృత్య ప్రదర్శన కళ్ళకు మిరమిట్లు కొలిపేలా ఉంటుంది!

దక్షిణ భారతదేశంలో కేరళరాష్ట్రానికి చెందిన ఈ నాట్యంపేరు కథకళి. కథకళి అంటే 'కథానాట్యం' అని అర్థం. సుప్రసిద్ధ ఇతివృత్తంతో ఉత్సాహభరితంగా ప్రదర్శించబడే కథకళి ఒక శాస్త్రీయ నృత్యనాటకం. నాట్యం, నాటకం, యుద్ధ కళల మిళితమైన ఈ నాట్య ప్రక్రియ దాదాపు మూడువందల సంవత్సరాల నుంచి ప్రదర్శించ బడుతోంది. తొమ్మిదవ శతాబ్దంలో ప్రాచుర్యం పొందిన కేరళ ప్రాంత 'కొడియాట్టం' కళా ప్రక్రియ ప్రభావం దీని మీద ఉంది. ఈ 'కొడి యాట్టా'న్ని సాంస్కృతిక వారసత్వ కళారూపంగా యునెస్కో ఇటీవల గుర్తించింది!



పురాణ, ఇతిహాసాల ఘట్టాలను తీసుకుని ఈ కళాకారులు నాట్యప్రదర్శనలిస్తారు.

ఈ నృత్య నాటికలలో నాట్యం చేసేవారు ఒక్కమాటకూడా మాట్లాడరు. అయితే వేదికకు పక్కన కూర్చుని కొందరు గాయకులు పురాణ కథను పాటలుగా పాడతారు. ఆ పాటలలోని కథాంశాలకు అనుగుణంగా నృత్యకారులు హస్త ముద్రలతో, ముఖభావాలతో నేత్రాభినయాలతో వివరిస్తూ నాట్యం చేస్తారు.

కథకళిలో ఇరవైనాలుగు పద్ధతులలో ఇమిడిపోయే ఏడువందల ముద్రలున్నాయి. నిపుణులైన నృత్యకారులు తమకళ్ళను పదిహేడు విధాలుగా కదిలించగలరని చెబుతారు. కనుబొమలను కదిలించడానికి ఎనిమిది విధాలు; కనురెప్పల కదలికకు ఎనిమిది విధాలు ఉన్నాయి. వాటినిచూస్తే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది.

ఇటీవలి కాలంవరకు కథకళిని పురుషులే ప్రదర్శించేవాళ్ళు. స్త్రీ పాత్రలనుకూడా వాళ్ళు ఎంతో అందంగా, అవలీలగా పోషించడం ప్రేక్షకులకు ఆనందం కలిగిస్తుంది.

### ముఖాలంకరణ

పెదవులు, కనుబొమలు, రెప్పలు పెద్దవిగా కనిపించడానికి వీలుగా నృత్యకారులు ముఖానికి ముదురు రంగులు వేసుకుంటారు. నాయకులు, ప్రతినాయకులు; రాజులు, రాణులు; మునులు, రాక్షసులు ఇలా ఒక్కొక్క పాత్రకు ప్రత్యేకమైనదుస్తుల అలంకరణ, ముఖాలంకరణ ఉంటాయి. ఈఅలంకరణచేసుకోవడానికే కనీసం నాలుగయిదు గంటలు పడుతుంది.



పచ్చరంగును మంచితనానికీ; ఎరుపును శక్తికీ, ధైర్యానికీ; నలుపును దుష్టస్వభావానికీ; పసుపు పచ్చ రంగును అద్భుతానికీ; తెలుపు రంగును నైర్మల్యం సూచించడానికీ ఉపయోగిస్తారు. ఈ రంగుల కలయికలు నాటకంలోని పాత్రల స్వభావాన్నీ, మానసిక స్థితినీ సూచిస్తాయి.

నాట్యకారులకళ్ళకుకాటుక వేయడంద్వారా పెద్దవిగా కనిపించేలా చేస్తారు. 'చుండపూ' అనే పువ్వు విత్తనాలను కళ్ళల్లోవేసుకుంటారు. ఇవి దీపంవెలుగులో ధగధగ మెరుస్తూ కళ్ళుఎర్రగా కనిపించేలా చేస్తాయి.

అలంకరణ చేసుకోవడానికి ముందు కళాకారులు ముఖాన్ని శుభ్రంగా కడుక్కుని, నుదుట శుభప్రదమైన చందనం బొట్టు పెట్టుకుంటారు. ఆ తరవాత అలంకరణ చేసుకోవడానికి వీలుగా, నేలమీద పడుకుంటారు.

ఈ నృత్యనాటికలను సంప్రదాయానుసారం, దేవాలయప్రాంగణాలలో, బహిరంగ ప్రదేశాలలో ప్రదర్శించేవాళ్ళు. రాత్రి బాగా పొద్దుపోయాక ప్రారంభించే ఈ నాటకాలను తెల్లవారుజాము వరకు ఆడేవారు.

కథకళి నృత్యకళాకారులు ముఖాలంకరణకు ప్రకృతి సిద్ధంగా లభించే రంగులనే వాడతారు. పచ్చ, పసుపు, ఎరుపు, తెలుపు, నలుపు రంగులు ఎలా తయారుచేస్తారో తెలుసా? ప్రకృతిసిద్ధంగా లభించే కొన్ని పదార్థాలను నూరి, కొబ్బరి నూనెతో కలిపి వాటిని తయారు చేస్తారు.

సున్నం నుంచి తెలుపురంగు తయారు చేస్తారు. ఎరుపురంగు కావాలంటే పసుపూ, సున్నం కలిపి తయారుచేస్తారు.



పచ్చని ఆకులు నూరి సున్నంతో కలిపితే పచ్చ రంగు సిద్ధం. కొబ్బరి చిప్పల పైపెంకు కాల్చి బొగ్గుచేసి, దానిని పొడిచేసుకుని కొబ్బరి నూనెతో కలిపి నలుపురంగు తయారుచేస్తారు.

పసుపురంగు కావాలంటే పసుపుపొడి ఉపయోగిస్తారు.



వళ్ళత్తోళ్ నారాయణ మీనన్ అనే కవి చెరుత్తురిత్తిలో 'కేరళ కళామండలం' స్థాపించిన తరవాత కథకళి నాట్యప్రదర్శనలో కొన్ని మార్పులు చేర్పులు ప్రవేశపెట్టి దానికి కొత్త ఊపిరిపోశారు. ప్రస్తుతం ఈనాట్య ప్రదర్శనలు సాయంకాల సమయాలలో కళామండపాలలో, వేదికలపై జరుగుతున్నాయి.

మనపురాణేతిహాసాలనుంచేకాకుండా ఇటీవల బైబిలుకథలను(మేగ్దలీన్ మేరీ)కూడా ఇతివృత్తాలుగా స్వీకరించి కథకళి ప్రదర్శనలు ఇస్తున్నారు.

# అనవసరపు విమర్శలు

సూఫీ సాధువుల గురించి మీరు వినే ఉంటారు. సూఫీమార్గం ఒక ఇస్లాం సంప్రదాయం. ప్రేమ మార్గాన్నీ,సోదరభావాన్నీ బోధించడంలో సూఫీలు సుప్రసిద్ధులు.అయినా జీవితంలో విమర్శలు ఎదుర్కోనివారుఎవరుంటారు? ఇది సూఫీలకూ తప్పలేదు.

ఒకానొకప్పుడు ఒకగ్రామంలోయువకుడొకడు ఎప్పుడు చూసినా సూఫీ సాధువులను కటువుగా విమర్శించేవాడు. వాడు మంచి మాటకారీ, దురుసు స్వభావీ కావడంతో వాదానికి దిగి వాణ్ణి మెప్పించడం ఎవరికీ సాధ్యపడేది కాదు. గ్రామ ప్రజలు వాడి విమర్శలను వినలేకపోయేవారు.

కొన్నాళ్ళు గడిచాక ఆ గ్రామంలోనే ఉంటూన్న ఒకసూఫీ సాధువు, యువకుడికి వాడి విమర్శల విలువ ఏపాటిదో తెలియజేయాలన్న నిర్ణయానికి వచ్చాడు.ఆయన తనవేలి ఉంగరాన్ని తీసి, యువకుడికిఇచ్చి, "నాయనా,దీనిని తీసుకువెళ్ళిసంతలో ఐదువందల రూపాయలకు అమ్ముకుని రా," అన్నాడు.

యువకుడు వెంటనే ఉత్సాహంగా సంతకు బయలుదేరాడు. కానీ ఎంత ప్రయత్నించినా సాధువు చెప్పిన ధరకు దానిని కొనేవాళ్ళు లేక పోయారు. ఆఖరికి ఒక స్త్రీ ఉంగరాన్ని అటూ ఇటూ కాస్సేపు తిప్పి చూసి, "కావాలంటే దీనికి పది రూపాయలిస్తాను, అదీ ఉంగరం కావాలని నా బిడ్డ అడగడంవల్లే," అన్నది.

యువకుడు తిరిగి వెళ్ళి జరిగింది సాధువుకు చెప్పాడు.ఆ తరవాత సాధువు,"ఇప్పుడు దానిని నగల వ్యాపారి దగ్గరికి తీసుకువెళ్ళి చూపి, ఎంతధర పలుకుతుందో అడుగు," అన్నాడు.

యువకుడు అలాగే నగల వ్యాపారి దగ్గరికి వెళ్ళి చూపాడు. అతడు దానిని పరిశోధించి, తూకం వేసి, "విలువైన ఉంగరం. ఐదువేల రూపాయలిస్తాను," అన్నాడు.

యువకుడు ఆశ్చర్యంతో సాధువు దగ్గరికి వచ్చి సంగతి చెప్పాడు. సాధువు చిన్నగా నవ్వి, "నాయనా, ఈ ఉంగరం గురించి సంతలోని స్త్రీకి ఎంత తెలుసో, సూఫీల గురించి నీకూ అంతే తెలుసు," అన్నాడు.

యువకుడు సిగ్గుతో తలదించు కున్నాడు. ఆ రోజునుంచి సాధువు లను అనవసరంగా,దురుసుగా విమర్శించడం మానుకున్నాడు.



మన పండుగలు

# దసరా ఉత్సవాలు!

మనదేశంలో దాదాపు అన్ని ప్రాంతాలలో ఆటపాటలతో, అలంకరణలతో ఆనందోత్సాహాలతో జరుపుకునే పండుగ దసరా. ఇది ఆశ్వయుజ మాసంలో వస్తుంది. దుర్గాదేవి లోక కంటకుడైన మహిషాసురుణ్ణి సంహరించినందుకు గుర్తుగా దసరా ఏర్పడిందని చెబుతారు.ఏ దేవుడిచేతా తనకు మరణం లేదని పరమశివుడి నుంచి వరం పొందిన మహిషాసురుడు, ఆ వరగర్వంతో విర్రవీగుతూ అందరినీ పీడించసాగాడు. మితిమించిన అహంకారంతో సాధువులనూ, సజ్జనులనూ హింసించసాగాడు. అందువల్ల దేవతలందరూ వెళ్ళి పరాశక్తిని వేడుకున్నారు. రాక్షస సంహారం కోసం దుర్గ అవతరించింది. దివ్యాస్త్రాలతో, అద్భుత శక్తులతో దుర్గాదేవి మహిషాసురుడి మీదికివెళ్ళి, యుద్ధంచేసి వాణ్ణిహతమార్చింది.



మహాలయ అమావాస్యతో ఆరంభమయ్యే ఈ పండుగను కొన్ని ప్రాంతాలలో తొమ్మిది రోజులు జరుపుకుంటారు. దీనిని దేవీ నవరాత్రులు అని అంటారు. పండుగ పదవరోజు విజయదశమితో పరిసమాప్తమవుతుంది.

కొన్ని ప్రాంతాలలో దీనిని పది రోజుల పండుగగా భావిస్తూ 'దసరా' అని పిలుస్తారు.

## పశ్చిమబెంగాల్‌లో దుర్గాపూజ

ఆడపడుచులు పండుగలూ, పర్వాలూ ఇతర ముఖ్యమైనసందర్భాలప్పుడు తల్లిగారింటికి రావడం మన సంప్రదాయం. ఆ ఆచారం ప్రకారం యేటా పర్వత రాజకుమారి అయిన దుర్గాదేవి సపరివారంగా తన పుట్టినిల్లయిన హిమాలయ పర్వతాలకు

వెళ్ళివస్తుందని బెంగాలీలలో ఒక విశ్వాసం. ఆమె అలా బయలుదేరి వెళ్ళడాన్ని పశ్చిమ బెంగాల్‌లో దుర్గాపూజగా జరుపుకుంటారు.

రాష్ట్రవ్యాప్తంగా జరిగే ఈ పండుగ సందర్భంగా విశాలమైన పందిళ్ళు వేస్తారు. వేదికల మీద బ్రహ్మాండమైన దుర్గ, లక్ష్మి, సరస్వతి, గణేశ, కార్తికేయ విగ్రహాలు ప్రతిష్ఠించి, దీపాలతో అలంకరిస్తారు. పాదాలవద్ద చచ్చిపడిన మహిషాసురుడితో, భయంకరమైన సింహాన్ని అధిరోహించిన భంగిమలో దుర్గాదేవి విగ్రహాన్ని తయారు చేస్తారు.

దుర్గాదేవి మహిషాసురుణ్ణి సంహరించడాన్ని చెడుమీద మంచి గెలుపుకు సంకేతంగానూ చెబుతారు.

మహాసప్తమినాడు అంటే ఏడవరోజు పూజను ప్రారంభించి, ఎనిమిదవ రోజు అంటే మహాఅష్టమినాడు పూర్తిచేస్తారు. మేళతాళాలతో సంప్రదాయబద్ధంగా పూజలు జరిపిస్తారు.

విజయదశమినాడు అలంకరించిన అందమైన శకటాలలో విగ్రహాలను అమర్చి మేళతాళాలతో, సంగీత వాయిద్యాలతో కోలాహలంగా నిమజ్జనానికి తీసుకువెళతారు.

ఈ సందర్భంగా చుట్టుపక్కల ఉన్న స్త్రీలు, ఊరేగింపు బయలుదేరడానికిముందు పందిళ్ళ వద్దచేరి విగ్రహం నుదుట కుంకుమబొట్టు పెడతారు. దుర్గాదేవి నోట్లో తీపి వంటకాన్నీ, చేతిలో తాంబూలాన్నీ ఉంచి, సంప్రదాయబద్ధంగా వీడ్కోలు పలికేఈ ఆచారాన్ని 'సింధూర్ ఖెల్లా' అని అంటారు.

దుర్గామాతకే కాకుండా స్త్రీలు, ఒకరికొకరు తిలకందిద్ది పరస్పర ప్రేమాభిమానాలు పంచుకుంటారు.

## మైసూరులో దసరా

దక్షిణాదిలో దసరా అనగానే మనకు గుర్తుకు వచ్చేవి మైసూరులో బ్రహ్మాండంగా జరిగే దసరా ఉత్సవాలు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో అంటే పధ్నాలగవ శతాబ్దంలో హంపి విజయనగరంలో ఈ ఉత్సవాలు ఘనంగా జరిగేవని చెబుతారు. చివరి విజయనగరం పాలకుడు,



ఆ ఉత్సవాలను జరిపే బాధ్యతను మైసూరు మహారాజా ముమ్మడి కృష్ణరాజ ఉడయార్‌కు అప్పగించాడట. ఉడయార్ పాలనాకాలంలో దసరా ఉత్సవాలు వైభవోపేతంగా జరిగేవి. ఆ సమయంలో సైనికదళాల ప్రదర్శన; సాయంకాలం సంస్థానంలో ఉన్నతోద్యోగులనుంచి గౌరవ వందనస్వీకారం జరిగేది. సుప్రసిద్ధ సంగీతకారులు, నర్తకులు, మల్లయుద్ధ వీరులు, కళాకారులు తమ ప్రావీణ్యాన్ని

ప్రదర్శించేవారు. అదేవిధంగా అలంకరించిన ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు కూడా ఊరేగింపులో భాగంగాఉండేవి. ఫిరంగులు, తుపాకులు, బంగారు, వెండి శకటాలు ఈ సందర్భంగా జరిగే ఊరేగింపుకు మరింత శోభను సమకూర్చేవి.

రాజప్రాసాద ప్రాంగణంలో పూజలు జరిపేవారు. అలంకరించిన పట్టపుటేనుగు అంబారీ మీద మహారాజావచ్చేవారు. ఊరేగింపుకు ముందు 'నందకంబ' ఉంటుంది. మేళ తాళాలు, నృత్యాలు ముందు వెళతాయి. పూర్వ వైభవం క్రమేణా తగ్గుతూవస్తున్నా, ఈనాటికీ మైసూరు దసరా ఉత్సవాలు ఘనంగానే జరుపుతున్నారు.

## హిమాచల్ ప్రదేశ్‌లో దసరా

హిమాచల్‌ప్రదేశ్ కులూ లోయలో దసరా వేడుకలను ప్రత్యేకపద్ధతిలో జరుపుకుంటారు. ఇక్కడి గిరిజనులు దసరాను ఒక సామూహిక ఉత్సవంగా జరుపుకుంటారు. రఘునాథదేవుడి బంగారు, వెండి విగ్రహాలను ఊరేగింపుగా తీసుకువెళతారు.

## తమిళనాడులో నవరాత్రి

తమిళనాడు రాష్ట్రంలో దీనిని నవరాత్రి ఉత్సవంగా జరుపుకుంటారు. విద్యాలయాలలో విద్యార్థులు సరస్వతిపూజ చేస్తారు. కార్మికులు పనిముట్ల పూజను జరుపుకుంటారు. వీటితోపాటు ఇంటింటా ముత్తయిదువలు పెట్టే బొమ్మలకొలువు ఈ పండుగ ప్రత్యేక ఆకర్షణ. కొలువులో పెట్టే ఈ బొమ్మలు కొన్ని కుటుంబాలలో ఒకతరంనుంచి మరొక తరానికి వస్తూ వుంటాయి. వీటికితోడు ఎప్పటికప్పుడు కొత్తబొమ్మలు కలుస్తూ ఉంటాయి. దేవతా విగ్రహాలతోపాటు, సమకాలీనవ్యక్తుల, వస్తువుల బొమ్మలు కూడా అలంకారానికి పెడుతూ ఉంటారు. గ్రామ దృశ్యం; పెళ్ళి దృశ్యం; సంగీత కచేరీ; పాఠశాల; వ్యాపార స్థలాలు, విమాన నిలయాలు, ఓడరేవులు ఇలా వారివారి అభిరుచులకు అనుగుణంగా బొమ్మల కొలువును అలంకరించుకుంటారు. అంటే, స్త్రీలలో

## రామ్-లీల



ఉత్తరాది రాష్ట్రాలలో-శ్రీరాముడు తన భార్య సీతాదేవిని అపహరించిన దుష్ట రావణ సంహారం చేసిన శుభసందర్భాన్ని పురస్కరించుకుని దసరా పండుగ ఆరంభమయిందని భావిస్తారు. రామ్-లీల పేరుతో శ్రీరాముడి కథను వీధినాటకంగా ప్రదర్శిస్తారు; రావణుడు, వాడి తమ్ముడు కుంభకర్ణుడు, కొడుకు ఇంద్రజిత్తు దిష్టిబొమ్మలను తగలబెట్టడం ఈ సందర్భంగా కోలాహలంగా చేస్తారు!



ఉన్న కళాభిరుచిని, నైపుణ్యాన్ని వ్యక్తీకరించ డానికి ఇది ఎంతగానో దోహదం చేస్తుంది.

పసిపిల్లలకు కూడా ఇది చాలా ముఖ్యమైన పండుగ. ఎందుకంటే పిల్లలకు విజయదశమి రోజున అక్షరాభ్యాసం ఆరంభిస్తే విద్య నిర్విఘ్నంగా కొనసాగుతుందనే విశ్వాసం పలువురికి ఉంది. అందువల్ల పసిపిల్లలను ఆరోజు బడిలో చేర్పిస్తూ ఉంటారు. ఒక్క విద్యాభ్యాసమే కాదు;ఏపనైనా సరే విజయదశమి రోజున ప్రారంభిస్తే తప్పక విజయవంతమవుతుందనే నమ్మకం ఉంది. విజయానికి సంకేతంగా విజయదశమిఉంటోంది!

## గుజరాత్‌లో ఆటపాటలు

దైవపూజలతోపాటు, ఆనందోత్సాహాలు వెల్లువిరిసే తరుణం గుజరాత్‌లో నవరాత్రి సమయం. యువతులు రంగురంగుల చోళీలు, ఘాగ్రాలులాంటి సంప్రదాయ దుస్తులను ధరించి, మట్టిప్రమిదదీపం చుట్టూ చప్పట్లు కొడుతూ సుతారంగా నృత్యం చేస్తారు. యువతీ యువకులు ఆకర్షణీయమైన గుజరాత్ సంప్రదాయ వస్త్రాలయిన చనియా, చోళీలు, కెడియాలు ధరిస్తారు.

కృష్ణుడూ, గోపికలూ కలిసి రాస(క్రీడ) నృత్యం చేశారని మనపురాణాలు పేర్కొంటున్నాయి. ఈ రాస నృత్యంలో చాలారకాలు ఉన్నాయి. వాటిలో 'దండియా' నృత్యం ప్రధానమైనది. అంటే కోలాటంలాంటిదన్నమాట. యువతీ యువకులు కోలాటంవేస్తూ నృత్యంచేస్తారు. మరొకరకం నృత్యం చప్పట్లు చరుస్తూ చేస్తారు. ఇది మన గొబ్బిఆటలాంటిది. దీనిని 'గార్బా'అంటారు. 'గార్బా'నృత్యంచాలా ప్రసిద్ధి చెందిన జానపద నృత్యం. లయబద్ధంగాసాగేఈ అందమైననృత్యానికి ఆరంభం శ్రీకృష్ణుడి మనమడు అనిరుద్ధుడి భార్య అయినఉషాదేవి కాలంఅని చెబుతారు!








# దీనిని చేసి చూడండి!



రంగు రంగుల తోరణాలు, హారాలు, పుష్పాలంకరణలు ఇవీ పండుగరోజులనగానే అందరికీ జ్ఞాపకం వచ్చేవి. ఇప్పుడు గోడలను అలంకరించడానికి రంగు రంగుల కాగితాలతో 'వాల్ హ్యాంగింగ్' తయారు చేయడం ఎలాగో చూద్దాం:

మూడు విభిన్నమైన రంగులుగల కాగితాలు తీసుకోండి. ఇక్కడ ఎరుపు,నీలం,పసుపుపచ్చ రంగుల కాగితాలు ఉపయోగించబడ్డాయి. వీటితో పాటు ఒక స్కేలు, పెన్సిల్, కత్తెర, జిగురు, సూది, నూలుదారం కూడా కావాలి.

1. ఒక్కొక్క షీట్ రంగుపేపర్ నుంచి ఏడేసి ముక్కలు కత్తిరించుకోవాలి. ఒక్కొక్క ముక్క రెండు కొసలు ఒకటిగా కలిపి అతికించి లూపులు తయారు చేసుకోవాలి. ఒక రంగు కాగితం ముక్కలకూ, మరొక రంగు కాగితం ముక్కలకూ పొడవులో తేడావుండాలి. ఇందులో తీసుకున్న కొలతలు ఇక్కడ ఇవ్వబడ్డాయి. నీలంరంగు: 15x1సెం.మీ; పసుపుపచ్చ: 12.5x1 సెం.మీ; ఎరుపు: 10x1 సెం.మీ.

2. మొదట నీలం రంగు లూపులను వలయాకారంలో అమర్చి పటంలో చూపినట్టు కుట్టుకోవాలి. లూపులు ఒకదానితో ఒకటి తగిలేచోట జిగురుతో అతికించుకోవాలి.

3. ఇప్పుడు ఎరుపురంగు లూపులను నీలం రంగు లూపులమధ్య అమర్చాలి. రెండు నీలంరంగు లూపులమధ్య ఉన్న ఖాళీస్థలంలో పసుపురంగు లూపు అతికించాలి.

4. ఇప్పుడు 'వాల్‌హ్యాంగర్' సిద్ధమయింది. ఒక లూపుకు దారంకట్టి గోడకు వేలాడదీస్తే చాలా అందంగా ఉంటుంది. గది కప్పునుంచి వేలాడదీసినా ఆకర్షణీయంగా కనిపిస్తుంది.

రకరకాల రంగు కాగితాలనూ, వస్తువులనూ ఉపయోగించి విభిన్నమైన కొలతలతో ఆకర్షణీయమైన డిజైన్లు తయారుచేయండి మరి!

# హాస్య చతురులు : జాదుమణి



పందొమ్మిదవ శతాబ్దానికి చెందిన సుప్రసిద్ధ ఒరియా కవి జాదుమణి తండ్రి ముకుంద్, గొప్ప శిల్పకారుడు. ఆయన ఒక కృష్ణ విగ్రహాన్ని చెక్కాడు. "రాధా నాథుణ్ణిఎక్కడికి తీసుకు వెళదాం?" అని అడిగాడు జాదుమణి. "మనమే ఒక గుడి కడదాం," అన్నాడు ఆయన తండ్రి.



తన దగ్గర ఉన్న ధనాన్నంతా వెచ్చించి ఆయన గుడికట్టాడు. పేదవాడై పోయాడు. మరణించేనాటికిఆయన అంత్యక్రియలు జరిపించడానికికూడా డబ్బులు లేవు. జాదుమణికి ఏం చేయాలో తోచలేదు. "రాజుగారు ఒక్కరే నాకు సాయం చేయగలడు. అయినా, ఆయనను నేను కలుసుకోవడం ఎలా? ఇప్పుడు ఏంచేయడం?" అని తీవ్రంగా ఆలోచించసాగాడు.



అప్పటికే మధ్యాన్నమయింది. పూజారి మధ్యాన్న పూజ ముగించి గుడి తలుపులు మూసుకుని వెళ్ళాడు. ఉన్నట్టుండి జాదుమణికి ఒక ఆలోచన వచ్చింది. "నయాఘర్ రాజు ఈ దారిగుండా వెళ్ళే సమయం ఇదే!" అంటూ గుడి దగ్గరికి పరిగెత్తి పోయి, గుడి తలుపులను గట్టిగా కొడుతూ, "అన్నయ్యా! రాధానాథ్, మేలుకో! దయచేసి మేలుకో!" అని గట్టిగా పిలువసాగాడు.



ఆ సమయంలో రాజుగారు పల్లకీలో అటుకేసి వచ్చాడు. ఎవడో మనిషి గుడి తలుపులు బాదడం చూసి దిగ్భ్రాంతి చెందాడు. వెళ్ళిసంగతే మిటో తెలుసుకోమని తన భటు లలో ఒకణ్ణి ఆజ్ఞాపించాడు.



భటుడు జాదుమణి దగ్గరికి వెళ్ళి సంగతి అడిగాడు. జాదుమణి "రాజుగారా!" అని ఆశ్చర్యం నటించి, భటుడికేదో మెల్లగా చెప్పాడు.



ఆ తరవాత భటుడి వెంట రాజు దగ్గరికి నడిచాడు. "రాధానాథ్ విగ్రహాన్ని మలిచిన సుప్రసిద్ధ శిల్పి ముకుందుడి కుమారుడీయన," అన్నాడు భటుడు. "ఏమిటి నువ్వు చేస్తున్న పని? నీకేమైనా పిచ్చి పట్టిందా ఏం?" అని గద్దించి అడిగాడు రాజు.



జాదుమణి తలవంచి నమస్కరించి, "ఈ రాధానాథుడు నా అన్నయ్య. నేనం పుట్టడానికిముందేమాతండ్రిఅతన్నికన్నాడు. పెద్దకుమారుడిగా తండ్రి అంత్యక్రియలు నిర్వర్తించడం అతడి కర్తవ్యంకదా ప్రభూ! అయినా, ఎంత అరిచినా, లేపినా లేడే మరి!" అన్నాడు.



రాజు డబ్బు సంచీని తీసి జాదుమణికి ఇస్తూ, "ఇప్పుడు నీ రాధానాథుడు మేల్కోడు. దీనిని తీసుకువెళ్ళి, ఆలస్యం కాకుండా నీ తండ్రి అంత్యక్రియలు జరిపించు. అంతా పూర్తి చేసుకుని నా ఆస్థానానికిరా. ఇలాంటివిషాద సమయంలోకన్నా, మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడు నీ చమత్కారసంభాషణను విని ఆనందించగలను," అన్నాడు.

## సుదూర పయనం!

ఇది ఒక చేప చేసిన పయనం. నాలుగేళ్ళలో ఒక బ్లాక్ మిర్లిన్‌చేప 13,000 కీ.మీ. దూరం పయనించింది. ఈ నాలుగేళ్ళ సుదీర్ఘపయనం దాదాపు 1966 లో ఆరంభమయింది. ఆస్ట్రేలియా గ్రేట్ బ్యారియర్ రీఫ్‌కు అవతల, బెరిల్‌యేట్స్ ఒక ప్రయాణీకుల నావలో వెళుతూ కనిపించిన ఆ చేపను పట్టుకుని దానికొక ట్యాగ్ కట్టి మళ్ళీ సముద్రంలో వదిలిపెట్టింది. గత మే నెలలో మధ్యఅమెరికాలోని కోస్టారికా కొపోస్‌లో ఒక మత్స్యకారుడి వలలో ఆ చేప పట్టుపడింది. ఈ మధ్య కాలంలో అది పసిఫిక్‌మహాసముద్రాన్ని ఈదుకుని వచ్చిందన్నమాట. ఆ మత్స్యకారుడు ట్యాగ్‌ను తీసి ఒక అమెరికా పరిశోధకుడికి పంపాడు. పరిశోధకుడు వార్తను బెరిల్‌యేట్స్‌కు చేరవేశాడు.




## జంతువిన్యాసాలు లేకుండా సర్కస్




అన్ని జంతువులు కాదుకానీ కొన్ని జంతువులను సర్కస్‌లో చూపరాదని భారత ప్రభుత్వం నిషేధించింది. సింహం, పులి, ఎలుగుబంటి, చిరుతపులి, కోతి వీటిని భారతదేశంలో సర్కస్ ప్రదర్శనలలో ఉపయోగించరాదన్న ప్రభుత్వ నిషేధాన్ని అంగీకరిస్తూ, సుప్రీంకోర్టు ఆనతి జారీ చేసింది. భారతసర్కస్ సమాఖ్య, మరి కొందరు సర్కస్ కంపెనీ యజమానులు ప్రభుత్వ నిషేధాన్ని వ్యతిరేకిస్తూ సుప్రీం కోర్టుకు అప్పీలు చేశారు. దానినికొట్టివేస్తూ సుప్రీంకోర్టు, తననిర్ణయాన్ని ప్రకటించింది. ఈ జంతువులు శిక్షణా సమయంలో అనేక హింసలకు లోనవుతున్నాయని సుప్రీంకోర్టు అభిప్రాయపడింది. దాదాపు నలభైయేళ్ళ న్యాయవివాదం తరవాత తుది తీర్పు వెలువడింది.

# అతి పొడవైన రైలు



ఆ రైలు పొడవు మీరు ఊహించుకోవలసిందే. దానిని పూర్తిగా చూడాలంటే ఏ విమానంలోనో పైకెళ్ళి ఎత్తునుంచి చూడవలసి ఉంటుంది. అంత పెద్దరైలును ఎక్కడ తయారుచేశారంటారా? పశ్చిమ ఆస్ట్రేలియాలో! పట్టాలమీద వదలినప్పుడు దానికి 682 వ్యాగన్లు (మనుషులు ప్రయాణం చేసే బోగీలుకావు) ఉన్నాయి. దానిని లాగడానికీ, వెనకనుంచి తోయడానికీ ఎనిమిది హెవీ రైలు ఇంజన్లు అమర్చారు. ఇంతకూ దాని పొడవెంతో తెలుసా? దాదాపు 7.35 కి.మీ. ఇప్పుడు ఊహించగలరుకదా అనంతమైన ఆ రైలు పొడవు!

## చిలకనుంచి అత్యావసరమైన పిలుపు!

ఇంగ్లాండు దేశంలో అత్యవసర పరిస్థితులలో పోలీసులను పిలవడానికి ఉపయోగించే టెలిఫోన్ నెం.999. ఇటీవల మాంచెస్టర్ పోలీసులకు ఒక ఎమర్జెన్సీ కాల్ వచ్చింది. వాళ్ళు కాస్త ప్రయత్నించి అది ఎక్కడినుంచి వచ్చిందో కూడా కనిపెట్టి హుటాహుటిగా అక్కడికి బయలుదేరారు. తీరా ఫ్లాట్ లోపలికి వెళ్ళి చూద్దురుగదా టెలిఫోన్‌దగ్గర ఒక ఆస్ట్రేలియా చిలుక ఉంది. రిసీవర్ కాస్త దూరంలో పడి ఉంది. రిసీవర్ పక్కన ఉన్నప్పుడు ఆ చిలుక నంబర్ 9 పుష్‌బటన్‌మీద మూడుసార్లు గెంతి ఉంటుందని గ్రహించి పోలీసులు వెను దిరిగారు.



# జిలేబీలు చెట్లకు కాచినరోజు

ఆనందుడు ఆ గ్రామంలోనే చాలా చురుకైన యువకుడు. అతడు చాలా చేతిపనులలో ఆరి తేరినవాడు. కంచెలు వేయగలడు; అల్లికలు అల్ల గలడు; కొయ్య బొమ్మలు చెక్కగలడు. అతడికి తెలియని పని అంటూ లేదు. అయితే, అతడి భార్య అనసూయ అతడి స్వభావానికి పూర్తిగా విరుద్ధం. . ఆమెకు చాలినంత తెలివితేటలు లేవు; ఏ పనిలోనూ ప్రావీణ్యంలేదు. పైగా పెద్ద వదరుబోతు. ఎక్కడేం జరిగినా తెలుసుకుని దానిని పది మందికీ చెప్పడంలో ఆమెకు చెప్ప లేనంత ఆనందం. ఆమె మాటలవల్లా, ప్రవర్తన వల్లా ఆనందుడు చాలాసార్లు ఇబ్బందుల పాలయ్యాడు. అయినా ఆమె తను కట్టుకున్న భార్య గనకా, స్వతహాగా ఎవరికీ హానిచేసే స్వభావం లేదుగనకా అతడు ఆమెను ప్రేమతో చూస్తూ వచ్చాడు.

ఒకనాడు ఆనందుడి భార్యకు బంగాళా దుంపల కూర తినాలనిపించింది. ఇంట్లో ఒక్క దుంపకూడా లేదు. ఆ విషయం భర్తకు చెప్పింది. ఆనందుడికి నాలుగురోజుల క్రితం అడవికి వెళ్ళి వస్తూండగా బంగాళాదుంపల మొక్కలు కనిపించాయి. వాటిని తవ్వి తెస్తానని అతడు అడవికి వెళ్ళాడు. అక్కడ పలుగుతో జాగ్రత్తగా తవ్వ సాగాడు. కొంతసేపయ్యాక పలుగుకేదో గట్టిగా తగిలింది. ఏమైఉంటుందా అని ఆలోచిస్తూ మరింత లోతుకు తవ్వాడు. చిన్న బిందె నిండుగా మెరుస్తూన్న బంగారు నాణాలు!



"ఇవి ఇక్కడికి ఎలా వచ్చాయి? వారం ముందు ఇక్కడ దుంపలకోసం తవ్వినప్పుడు ఈ బిందె జాడలేదు. ఆ తరవాతే దీనిని ఎవరో ఇక్కడ పాతిపెట్టి ఉండాలి. ఎవరైఉంటారు? బహుశా ఏ దొంగో పాతిపెట్టి ఉంటాడు. దొంగ పాతిపెట్టిన బంగారం ఇప్పుడు తనకు దొరికింది. వదులుకో కూడదు," అనుకుంటూ దానినితీసుకుని ఇంటికేసి బయలుదేరాడు.

నాలుగడుగులు వేశాక వాడికి భార్య జ్ఞాపకం వచ్చి అక్కడే నిలబడిపోయాడు. "అనసూయకు ఈ సంగతి ఎలా చెప్పడం? ఆమె నోట్లో ఏమాటా క్షణంకూడా నిలవదే. వెంటనే దానిని ఎవరికంటే వాళ్ళకు చెప్పేస్తుంది. ఈ నాణాలను తానెక్కడో దొంగిలించినట్టు రక్షకభటులు తననే అనుమానించ

వచ్చు. ఇవి బంగాళాదుంపల తోటలో దొరికాయని చెబితే ఎవరుమాత్రం నమ్మగలరు?''అని మెల్లగా వెనక్కుతిరిగి, దానిని కిందపెట్టి తీవ్రంగా ఆలోచించ సాగాడు.

కొంతసేపటికి ఒక ఆలోచన వచ్చింది. దానిని అమలుచేయడానికి నిర్ణయించాడు. చుట్టు పక్కల కలయచూశాడు. ఒక మర్రివృక్షం బోదెలో పెద్ద తొర్ర కనిపించింది. బంగారు నాణాలున్న బిందెను అతడు జాగ్రత్తగా అందులో దాచాడు. బిందె బయటినుంచి కనిపించదని రూఢి చేసుకున్నాక అక్కడినుంచి గ్రామంకేసి నడిచాడు.

అతడు గుడికి సమీపంలో ఉన్న మిఠాయి దుకాణం దగ్గరికి వెళ్ళి, ''గోవిందు బాబయ్యా, బంగాళాదుంపల కోసం ఎదురుచూస్తున్నాను. ఇంత ఆలస్యం అయిందేమిటి?''అంటూ ఎదురు వచ్చింది.

''అడవిలోని మామిడిచెట్లకు మామిడి కాయలు విరగకాచి ఉన్నాయి. బాగా పండి ఉన్నాయి. మనం వెళ్ళి వాటిని కోసుకు వద్దామా? భోజనంలో తియ్యటి మామిడి పచ్చడి తినాలని ఉంది,'' అన్నాడు ఆనందుడు ఉపాయంగా మాట మారుస్తూ.

కొంతసేపటికి భార్యాభర్తలు అడవిని సమీపించారు. అతడు ఆమెను మర్రివృక్షం సమీపంలోఉన్న మామిడిచెట్ల దగ్గరికి తీసుకు వెళ్ళాడు. ''మామిడికాయలు నేను కోస్తాను,''



వీసెడు జిలేబీలు ఇస్తావా?''అని అడిగాడు. దుకాణం యజమాని జిలేబీలు పొట్లంకట్టి ఇచ్చాడు.దానిని తీసుకుని అతడు పళ్ళదుకాణందగ్గరికివెళ్ళి,ఒక అస్తం అరటిపళ్ళు కొన్నాడు. అక్కణ్ణించి వాటిని తీసుకుని మర్రిచెట్టు ప్రాంతానికినడిచాడు. తాను అనుకున్న పథకాన్ని పకడ్బందీగానెరవేర్చి, చకచకా ఇంటికేసి బయలుదేరాడు.

అంతలోనే అనసూయ ఓర్పు కోల్పోయి, ''వంటంతా పూర్తయింది. నువ్వు తెస్తానన్న

అంటూ ఆమె ముందుకు అడుగు వేసింది గాని, అక్కడే ఆగిపోయి,''అరరే, ఈ చెట్టుమీద జిలేబీలు ఉన్నాయి, వచ్చి చూడండి,'' అంటూ ఆశ్చర్యంతో కేక పెట్టింది.

''అలాగా! అదెలా సాధ్యం?'' అంటూ ఆనందుడు నవ్వుతూ అక్కడికి వచ్చాడు.

నిజానికి ఒక పథకం ప్రకారం, మామిడి చెట్లకు జిలేబీలను మామిడికాయల్లా వేలాడ దీసింది అతడే. అయినా వాటిని చూడగానే



అమితాశ్చర్యం నటిస్తూ, "ఏమిటి అద్భుతం! మహాఅద్భుతం!మామిడిచెట్లమీద జిలేబీలు!" అన్నాడు.

"నువ్వు వెళ్ళి పూజకు కొన్ని జాజిపూలు కోసుకురా. నేను వెళ్ళి ఇంకో మామిడిచెట్లో కాయలున్నాయేమో చూస్తాను," అంటూ ఒక పూలపొదను చూపించి ముందుకు వెళ్ళాడు ఆనందుడు.

రెండు నిమిషాలు గడిచేలోపల అనసూయ మళ్ళీ ఆశ్చర్యానికి లోనయింది. "జాజిపొదల మీద అరటిపళ్ళు!" అని అరిచింది.

ఆనందుడికి తెలుసు అవి అక్కడ ఉంటాయని.. అతడే వాటిని అక్కడ జాగ్రత్తగా అమర్చాడు. అయినా, భార్య ఆశ్చర్యంతో పరిగెత్తుకుంటూ రాగానే అతడూ ఎక్కడలేని ఆశ్చర్యం నటించాడు.

"జాజిపొదలమీదనాకీపళ్ళుదొరికాయి!" అంటూ రెండుపళ్ళు తుంచి భర్తచేతిలో పెట్టింది అనసూయ.

"మామిడిచెట్టుమీద జిలేబీలు! జాజిపొదలపై అరటిపళ్ళు!! ఈరోజు అడుగడుగునా అద్భుతాలు జరుగుతున్నాయి," అంటూ అతడు యథాలాపంగా మఱ్రివృక్షం బోదెపై ఆనుకుని మఱ్రి వృక్షాన్ని పరిశీలనగాచూస్తూ, ఆనందాశ్చర్యాలతో ఒక్కసారి ఎగిరిగంతేశాడు. "మళ్ళీ ఒక అద్భుతం!" అంటూ కేకపెట్టాడు.

"ఏమిటది?" అని అడిగింది అనసూయ పట్టరాని ఉత్కంఠతతో.

"చెట్టు తొర్రలో లోహపుబిందె," అంటూ తొర్రలోకి వంగి దానిని అనందంగా వెలుపలికి తీశాడు.

"బంగారం!బంగారం!" అంటూ ఆమె ఒక్కక్షణం ప్రపంచాన్నే మరిచిపోయింది.

ఇద్దరూ కలిసి దానిని ఇంటికి తీసుకు వెళ్ళారు.

ఈసంగతి కొంతసేపట్లోకారుచిచ్చులా ఊరంతా వ్యాపిస్తుందని తెలిసినప్పటికీ ఆనందుడు భార్యను, "మనకు బంగారం దొరికిన విషయం వేరెవరికీ తెలియకూడదు," అని హెచ్చరించాడు.

"దానిని గురించి పెదవి విప్పితే ఒట్టు!" అని మాట ఇచ్చింది అనసూయ.

అయినా మరి కొంతసేపటికల్లా, ఆమె పనిగట్టుకుని పక్కింటికి వెళ్ళి, "ఇది చాలా రహస్యం. మరెవ్వరికీ చెప్పకూడదు. నా ప్రాణ స్నేహితురాలివిగనక నీకుచెబుతున్నాను," అంటూ బంగారం దొరికినవిషయాన్ని స్నేహితురాలికి చెప్పేసింది.

ఆమె,మరొక స్నేహితురాలికీ; ఆ స్నేహితురాలు తన మరదలికీ; మరదలు తోడుకోడలికీ; తోడుకోడలు ఎదురింటి స్నేహితురాలికీ చెప్పడంతో గంటలో విషయం పోలీస్‌స్టేషన్ వరకు వెళ్ళింది.

"ఇప్పుడే వెళ్ళి ఆనందుణ్ణి పిలుచుకురా! ఇది చాలా తీవ్రమైన విషయం! రాత్రికి రాత్రే వాడి పెరట్లో, లారీ నిండుగా బంగారం అంటే

మాటలా? వెళ్ళి వెంటనే పిలుచుకురా,''అని ఒక పోలీసును ఇన్‌స్పెక్టర్ పురమాయించాడు.

పోలీసు ఆయనకు సెల్యూట్ చేసి ఆజ్ఞను నెరవేర్చడానికి స్టేషన్ బయటకు నడిచాడు. చిన్న బిందెడు బంగారం ఆ నోటా ఈనోటా పడి అంతలోనే లారీ నిండు బంగారంగా ఎలా మారిపో యిందో గమనించారుకదా! ఏది ఏమైతేనేం, ఆనందుణ్ణీ, అతని భార్య అనసూయనూ క్షణాలలో స్టేషన్‌కు నడిపించాడు పోలీసు!

ఇన్‌స్పెక్టర్ వాళ్ళకేసి ఆగ్రహంగాచూస్తూ, ''ఏమిటినేను విన్నదంతా నిజమేనా? నిన్న రాత్రి మీ పెరట్లోకిఒకలారీ వచ్చి బంగారం దించిందట!'' అని అడిగాడు.

''లారీ నిండుగానా?''అంటూ అనసూయ అదిరిపడి, ''కాదు బాబూ కాదు. మాకు ఒకచిన్న బిందెడు బంగారమే దొరికింది. అంతే,''అన్నది.

ఆనందుడేమీ మాట్లాడలేదు.

''అదొక్కటేకాదు బాబూ, పొద్దున అన్ని రకాల అద్భుతాలూ జరిగాయి,''అన్నది అనసూయ కంఠస్వరం కాస్త తగ్గించి.

''అద్భుతాలా!'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఏమీ అర్థంకానట్టు.

''మామిడిచెట్టు మీద జిలేబీలు కాచాయి!'' అన్నది అనసూయ ఆశ్చర్యంగా.

ఇన్‌స్పెక్టర్ ఆమెకేసి వింతగా చూశాడు. ''మామిడిచెట్టుమీద జిలేబీలా?'' అని మళ్ళీ ప్రశ్నించాడు.

''అవును దొరా, జాజిపొదలమీద అరటి పళ్ళు కాచాయంటే చూడండి,''అన్నది ఆమె కనుగుడ్లు తిప్పుతూ.

''జాజిపొదల మీద అరటిపళ్ళా!''అని, ఆమెకు మతి చలించినట్టుంది అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్ ఆమెను ఎగాదిగాచూస్తూ.

''అంతేకాదు! మర్రిచెట్టు తొర్రలో బిందెడు బంగారు నాణాలు దొరికాయంటే నమ్మండి!'' అని పూర్తిచేసింది అనసూయ బుగ్గ నొక్కు కుంటూ.

ఇన్‌స్పెక్టర్ ఆమెభర్తకేసి జాలిగా చూశాడు. ఆమె పిచ్చిదని ఆయన దృఢనిశ్చయానికి వచ్చి, ''అలాగా! ఫరవాలేదు. నువ్వు ఇక ఇంటికి వెళ్ళ వచ్చు,''అని ఆనందుడికేసి తిరిగి, ''ఆమెను జాగ్రత్తగా చూసుకో, నాయనా,'' అన్నాడు.

ఆనందుడూ, అనసూయా ఇంటికి తిరిగి వచ్చారు. బిందెడు బంగారు నాణాలు వాళ్ళ సొంతమయ్యాయి. ఇంటికి రాగానే, ''అవునూ, ఆ ఇన్‌స్పెక్టర్‌బాబు చివరగా మాట్లాడింది నాకేమీ అంతుబట్టలేదు. అసలు ఆయన ఉద్దేశం ఏమిటి!'' అని భర్తను అడిగింది అనసూయ అమాయకంగా.



# మనదేశం గురించి తెలుసుకుందాం

## క్విజ్

పండుగల కాలం ఆరంభమయింది. పండుగలు చాలావరకు మతపరమైనవి. కొన్ని పంటలకు సంబంధించినవి. ఇంకా కొన్ని సమాజపరమైనవి. మన పండుగలకు సంబంధించిన ఈ నెల క్విజ్‌ద్వారా వాటిని గురించి మనకు ఎంతవరకు తెలుసో చూద్దాం:

1. మహావిష్ణువు పది అవతారాలలో ఒకదానితో సంబంధం కలిగిన పండుగ ఏది?
2. రావణసంహారం చేసి, సీతను పరిగ్రహించి, పధ్నాలుగేళ్ళ వనవాసం ముగించుకుని శ్రీరాముడు అయోధ్యకు విజయవంతంగా తిరిగివచ్చిన దానికి గుర్తుగా ఒక పండుగ ఏర్పడింది. ఆ పండుగ ఏది? 2001 లో అది ఏ తేదీన వస్తుందో తెలుసా?
3. పిల్లలకు ఆరోజు విద్యాభ్యాసం మొదలుపెడతారు. ఆరోజు ఏది? బెంగాలీలు చదువులతల్లి సరస్వతిని వేరొక పండుగరోజు పూజిస్తారు. ఆ పండుగ ఏది?
4. ఏ రెండు పండుగలు అన్నదమ్ములనూ, అక్కచెల్లెళ్ళనూ కలుసుకునేలా చేస్తాయి? అవి ఏవి?
5. పార్సీలు తమ ప్రవక్త జన్మదినాన్ని ఏరోజు జరుపుకుంటారు?
6. ముస్లింలు తమ ప్రవక్త జన్మదినాన్ని వేరొకపేరుతో జరుపుకుంటారు. దాని పేరేమిటి?
7. 'ఈస్టర్' ప్రాముఖ్యత ఏమిటి?
8. 'బుద్ధపూర్ణిమ' లేదా 'వైశాఖపూర్ణిమ'కు మూడురకాలుగా ప్రాముఖ్యత ఉంది. అవి ఏవి?
9. ఒక పండుగరోజు తమిళనాడు స్త్రీలు పొంగళ్ళు పెట్టి, అవి బయటకు పొంగేలా చేస్తారు. ఆ పండుగ పేరేమిటి?
10. మకర సంక్రాంతిరోజున, దక్షిన భారతదేశంలోని ఒక దేవాలయంలో ఒక వింత దృశ్యం కనబడుతుంది. ఆ దేవాలయం ఏది? కనిపించే వింత దృశ్యం ఏమిటి?

[ఈ ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో]

### సెప్టెంబర్ క్విజ్ సమాధానాలు

1. నలంద.
2. రవీంద్రనాథ టాగూర్, 1901 లో.
3. కళాక్షేత్ర, రుక్మిణీదేవి అరుండేల్.
4. 1986.
5. సిమ్లా.
6. పండిత మదన్‌మోహన్ మాలవ్యా.
7. అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం.
8. 'బేసిక్ ఎడ్యుకేషన్'.
9. మౌలానా అబుల్ కలాం ఆజాద్.
10. 1857.
11. లార్డ్ మెకాలే చేత 1835 లో.
12. మద్రాసు విశ్వవిద్యాలయ మాజీ వైస్ ఛాన్సలర్ డా. మాల్కమ్ ఆదిశేషయ్య.
13. ద్రోణాచార్యుడు.
14. కళామండలం, చెరుతురుత్తిలో.
15. తక్షశిల.



# దేవీభాగవత కథలు

వైరాగ్య చిత్తంతో వివాహంచేసుకోనని పట్టు బట్టిన శుకుడికి, వ్యాసుడు తాను రచించిన దేవీభాగవతం చెప్పాడు:

విష్ణువు మర్రి ఆకు మీద పిల్లవాడుగా ఉండి, ''నేనిక్కడ పిల్లవాడి రూపంలో ఎందుకున్నాను? నన్ను ఎవరు సృష్టించారు? ఈ విషయాలు నాకు ఎలా తెలుస్తాయి?'' అని విచారిస్తూంటే, అతన్నిచూసి జాలిపడి దేవి అతనికి సగం శ్లోకంచెప్పి, ''ఇదే సమస్త మూనూ. దీన్ని తెలుసుకుంటే నన్నెరిగినట్టే,'' అన్నది.

విష్ణువు ఆ సగం శ్లోకాన్ని విన్నాడుగానీ, అర్థం చేసుకోలేకపోయాడు.

అతను ఆ సగం శ్లోకాన్ని పఠించసాగాడు. అంతలో మహాదేవి నాలుగు చేతులలో శంఖ, చక్ర,గదాదులు ధరించి, మేలిమి బంగారు బట్టలు కట్టి, తనలాటివారే అయిన శక్తులను వెంటబెట్టుకుని విష్ణువు ఎదట ప్రత్యక్ష మయింది.

విష్ణువు ఆమెను చూసి దిగ్భ్రాంతుడై ఏమీ అనలేకపోయాడు. అప్పుడామె అతనితో, ''మాయ మూలంగా నన్ను మరిచావు. ఇప్పుడు నువ్వు సగుణుడివి. నేను సత్త్వ శక్తిని, నీ బొడ్డు కమలంలో బ్రహ్మ పుట్టి, రజోగుణంగలవాడై అన్ని లోకాలూ సృష్టి చేస్తాడు. అతను చేసిన సృష్టికి నువ్వు పాలకుడవుగా ఉంటావు. ఆ బ్రహ్మదేవుడి కను బొమలమధ్య నుంచి, క్రోధవశాన రుద్రుడు పుట్టుకొస్తాడు. ఆ రుద్రుడు తీవ్రమైన తపస్సు చేసి, దాని మూలంగా తామసగుణం కలిగిన వాడై, ప్రళయకాలంలో, బ్రహ్మ సృష్టించిన ప్రపంచాన్ని నాశనం చేస్తాడు. నువ్వు నా

3. దేవీభాగవతం–సుదర్శనుడి కథ



సహాయంతోనే ప్రపంచాన్ని పోషించవలసిన వాడివి కనక సత్త్వశక్తినైన నన్ను గ్రహించు. నేను ఎల్లప్పుడూ నీ వక్షస్థలంలోనే ఉంటాను,'' అన్నది.

ఆమెతో విష్ణువు, ''నాకు ఒక అర శ్లోకం వినబడింది. దాన్ని నేను ఎలా విన్నానో నువ్వు చెప్పు,'' అన్నాడు.

''నన్ను సగుణగా నువ్వు చూస్తున్నావు. నీకా అరశ్లోకం చెప్పినది నిర్గుణస్వరూపి అయినపరదేవత. ఇది భాగవతమనే పేరుగల మంత్రం. దీన్ని విడవకుండాపఠించితే శుభాలు కలుగుతాయి,'' అన్నదామె.

విష్ణువు ఆ మంత్రబలంతోనే మధుకైట భులను చంపి,వారికి భయపడి తనకు శరణు జొచ్చిన బ్రహ్మకు దాన్ని ఉపదేశించాడు. బ్రహ్మ నారదుడికీ, నారదుడు వ్యాసుడికీ ఉపదేశించారు. వ్యాసుడు మహిమాన్వితమైన ఆ మంత్రాన్ని శుకుడికి ఉపదేశించి, ''దీన్నే నేను అనేక సంహితలుగా విస్తరించి రచించాను,'' అన్నాడు.

శౌనకాదిమునులు శుకుడి కథ విన్న తరవాత దేవీభాగవత కథలు వినిపించ మన్నారు. సూతుడు ఇలా చెప్పసాగాడు:

కోసలదేశపు రాజధాని అయోధ్యానగరాన్ని ధ్రువసంధి అనేరాజు పాలించేవాడు. ఆయనకు మనోరమ, లీలావతి అని ఇద్దరు భార్యలు. మనోరమకు సుదర్శనుడనీ, లీలావతికి శత్రుజిత్తు అనీ కొడుకులు కలిగారు.

ధ్రువసంధి ఒకనాడు వేటాడుతూండగా సింహం ఒకటి అతనిమీదపడింది. సింహమూ, ధ్రువసంధీ హోరాహోరీ పోరాడి చివరకు ఇద్దరూ చనిపోయారు.

మనోరమ తండ్రి కళింగదేశపు రాజు వీరసేనుడు, తన అల్లుడు చనిపోయిన వార్త విని మనమడైన సుదర్శనుడి క్షేమం చూడ డానికి వచ్చాడు. అలాగే ఉజ్జయిని నుంచి శత్రుజిత్తు మాతామహుడైన యుధాజిత్తు కూడా వచ్చాడు.

సుదర్శనుడు, శత్రుజిత్తు ఇరువురిలో ఎవరిని రాజు చేయడమా అన్న విషయంలో ఇద్దరుమాతామహులమధ్యభేదాభిప్రాయాలు తలెత్తాయి. ఘర్షణపడ్డారు. ఆ పోరాటంలో యుధాజిత్తు వీరసేనుణ్ణి చంపేశాడు.

మనోరమ బిడ్డగావున్న సుదర్శనుణ్ణివెంట బెట్టుకుని భరద్వాజాశ్రమం చేరింది. భరద్వా జుడు ఆమెనూ, బిడ్డనూ ఆదరించి,శత్రువుల బారి నుంచి కాపాడి, సుదర్శనుడికి విద్యా బుద్ధులు నేర్పాడు. యుక్తవయస్కుడైన సుదర్శనుడికి ఒకరోజు మహాదేవి కలలో కనిపించి అస్త్రవిద్య ప్రసాదించింది.

కాశీరాజు సుబాహుడి కూతురు శశికళ, అద్భుత సౌందర్యవతి అని విని, సుదర్శనుడు ఆమెను పెళ్ళాడగోరాడు. అదేవిధంగా శశికళ కూడా సుదర్శనుణ్ణే పెళ్ళాడ నిశ్చయించింది.

సుబాహుడు తన కుమార్తె శశికళ స్వయం వరం ప్రకటించాడు. నానాదేశాల రాజులూ కాశీకి వచ్చారు. అయితే శశికళ సుదర్శనుణ్ణే పెళ్ళాడతానని పట్టుపట్టింది!

రాణి తన కుమార్తె వద్దకు వెళ్ళి, "అమ్మా, నిన్ను పెళ్ళాడాలని అంతమంది రాజులు వచ్చి ఉండగా, సుదర్శనుణ్ణి పెళ్ళాడతానని పట్టు బట్టి, మన ప్రాణాలమీదికి ఎందుకు తెస్తావు? స్వయంవర సభకు పద. నువ్వు సుదర్శనుణ్ణే వరిస్తానంటే, యుధాజిత్తు ఆ సుదర్శనుడితో పాటూ నిన్నూ, నన్నూ, నీ తండ్రినీకూడా చంపేస్తాడు!" అని హెచ్చరించింది.

ఎన్ని చెప్పినా, శశికళ మరొకరిని పెళ్ళాడ నన్నది. ఆమె తండ్రితో, "నీకు ఈ రాజులంటే భయం అయితే నన్ను సుదర్శనుడికిచ్చి, రథంలో మమ్మల్ని పొలిమేర దాటించు. యుద్ధం జరిగితే అతను శత్రువులను తానే చంపేస్తాడు," అన్నది.

"చూడు, తల్లీ! అనేకమందితో విరోధం తెచ్చుకోవటం ఎవరితరమూ కాదు. మిమ్మల్ని పొలిమేర బయట వదిలినంతమాత్రాన ఆ దుర్మార్గులు మిమ్మల్ని చుట్టుముట్టితే మీరు చెయ్యగలిగినదేమున్నది? నాకొక పద్ధతి తోస్తున్నది. సీత పెళ్ళికి పెట్టినట్టుగా నీ పెళ్ళికి ఒక పరీక్ష పెడతాను. అందులో నెగ్గినవాణ్ణి పెళ్ళాడు," అన్నాడు సుబాహుడు.

"అందువల్ల సమస్య తీరుతుందా? పందెంలో ఎవడో గెలిచి నన్ను పెళ్ళాడతాడు.



అప్పుడు మిగిలినవాళ్ళు ఊరుకుంటారా? ఎలాగూ యుద్ధం తప్పదు. మహాదేవిని నమ్ము కుని నన్ను సుదర్శనుడికిచ్చి పెళ్ళిచెయ్యి," అన్నది శశికళ.

ఆమె నిర్ణయించిన పథకాన్ని ఆమోదిం చాడు సుబాహుడు.

సుబాహుడు రహస్యంగా వివాహ ప్రయ త్నాలు జరిపించి, సుదర్శనుణ్ణి రప్పించి, తన కూతుర్ని అతనికి శాస్త్రోక్తంగా కన్యాదానం చేశాడు. ఆ సందర్భంలో ఆయన తన అల్లుడికి రెండువందల రథాలూ, కొన్నివేల గుర్రాలూ, కొన్ని వందలమంది దాసీలూ, ఇతర కానుకలూ ఇచ్చాడు. అతను మనోరమతో, "అమ్మా, ఇక నా కూతురు నీ కొడుకు సొత్తు, నీసొత్తు. దాన్ని ప్రేమగా చూసుకో," అని నమస్కారం చేశాడు.

మనోరమ ఎంతో సంతోషంతో, "అయ్యా, మహారాజువై ఉండి కూడా రాజ్యహీనుడైన నా కొడుక్కు నీ కూతుర్ని పెళ్ళిచేశావు! నీవంటి



ఉత్తముడు ముల్లోకాలలో ఎక్కడా ఉండడు. నీ కుమార్తె భారం మాది అయితే, మా భారం నీది!'' అన్నది.

దానికి సుబాహుడు, ''అమ్మా, నీ కొడుకు రాజ్యవిహీనుడని ఎందుకు అనుకోవాలి? నా రాజ్యం అతనిది కాదా? నా సేనఅంతా ఇస్తాను. మనం నీరక్షీర న్యాయంగా ఉండేటప్పుడు ఒకడు రాజనీ, ఇంకొకడు సేవకుడనీ విచక్షణ దేనికి? జగదంబ అండ ఉండగా విచారం దేనికి?'' అన్నాడు.

''ఎంత చల్లనిమాట అన్నావు, బాబూ! నీకు శుభం కలుగుతుంది. నీ రాజ్యాన్ని నువ్వూ, నీ కొడుకులూ సుఖంగా ఏలుకోండి. జగన్మాత అనుగ్రహంతో నా కొడుకు తన తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించుకుంటాడు. గ్రహచారం సరిగా ఉన్నవాడు మట్టి పట్టుకుంటే, బంగారమవుతుంది. ఏది చేసినా కలిసివస్తుంది. అందరూ సహాయపడతారు. ఇప్పుడు నా కొడుకు రోజులు మంచివి. కీడు రాదు,'' అన్నది మనోరమ.

సుబాహుడు పెళ్ళితంతు పూర్తిచేసి, తన కూతురికి, అల్లుడికి అప్పగింతలూ, అంపకాలూ జరుపుతూండగా, కొందరు వచ్చి, ''రాజా, వధూవరులను ఇప్పుడు పంపకండి. దారిలో శత్రువులు రాక్షసులలాగా కాపువేసి ఉన్నారు,'' అని చెప్పారు.

రాజుల సంగతి ఎరిగినవాడు కావటంచేత సుబాహుడు ఆ మాట నమ్మి, అంపకాలు చెయ్యటానికి సంశయించాడు.

అప్పుడు సుదర్శనుడు అతనితో, ''రాజా, నువ్వేమీసంకోచించవద్దు,దేవి నాపక్షానఉండగా ఈ రాజులు నన్నేం చెయ్యగలరు?'' అన్నాడు.

కాశీరాజు తన అల్లుడికి అంతులేని ధనం ఇచ్చి సాగనంపుతూ, సైన్యంతోసహా తానుకూడా తోడు బయలుదేరాడు.

దారులు కాచివున్న రాజులు దూరంనుంచి చూసి, ''అదుగో రథం! వాడే సుదర్శనుడు! పెళ్ళాంతోసహా పోతున్నాడు. పట్టుకుని కొడదాం పట్టండి!'' అంటూ విజృంభించారు.

సుబాహుడు వారికి అడ్డుపడ్డాడు. సుదర్శనుడు మంత్రం జపిస్తూ, అంబను ధ్యానించాడు. ఆ సమయంలో శత్రుజిత్తూ, యుధాజిత్తూ అతనిపైకి వచ్చారు. సుబాహుడు వీరావేశంతో శంఖం పూరించి, యుధాజిత్తు మీద వరసగా బాణాలు వేశాడు. ఇద్దరికీ తీవ్రంగా యుద్ధం సాగింది.

అంతలో జగదంబ దివ్యమైన ఆకారంతో, అనేక మహాయుధాలతో, పూలమాలలతో, సింహంమీద ప్రత్యక్షమయింది. సుదర్శనుడు ఆనందంతో శరీరం పులకరిస్తూండగా దేవిని తన

మామకు చూపి, "ఇంకమనకు భయమే మిటి?" అని చెప్పి, రథం దిగి, తన భార్యనూ, మామనూ వెంటబెట్టుకుని, దేవి కాళ్ళకు ప్రణామం చేశాడు.

ఏనుగులు సింహాన్ని చూసి భయపడి ఘీంకారాలు చేస్తే, సింహం వాటిని చూసి గర్జించింది. అదేసమయంలో దారుణంగా గాలివీచి, బీభత్సం చెలరేగింది. రాజులందరికీ కుపరం పుట్టింది. వాళ్ళు దిక్కు తెలియనట్టుగా నిశ్చేష్టులై చూడసాగారు.

అప్పుడు సుదర్శనుడు సేనాపతితో, "మహాదేవి మనకు అండగా వచ్చింది. నువ్వు సంశయించక, రాజులమీదికి సేనలు నడిపించు," అన్నాడు.

కాశీరాజు సేనలు రాజులపైకి విజృంభించాయి.

అప్పుడు, తెల్లబోయి చూస్తున్న రాజులతో యుధాజిత్తు, "ఎవరో ఆడది సింహంమీద వచ్చేసరికి మీకు మతులుపోయాయేమిటి? ఒక అర్భకుడు ఒక ఆడదాన్ని తోడు తెచ్చుకుంటే ఇందరు రాజులూ కొయ్యబారిపోతారా? క్షణంలో వాణ్ణిచంపి, రాజు కూతుర్ని వశపరుచుకుందాం, పట్టండి!" అని, తన మనమడైన శత్రుజిత్తును వెంటబెట్టుకుని, సుదర్శనుడి మీద యుద్ధం సాగించాడు.

అప్పుడు అంబ అందరి రాజులకూ అన్ని రూపాలలో కనబడి, అందరితోనూ ఒక్కసారే యుద్ధంచేసింది. క్షణంలో యుధాజిత్తూ శత్రుజిత్తూ బాణాలు తగిలి చచ్చారు. సుబాహుడు ఆనందబాష్పాలు రాల్చుతూ, ఆ పరాశక్తిని స్తోత్రం చేశాడు. తరవాత అతను ఆమెతో, "తల్లీ, నీ దర్శనంతో ధన్యుణ్ణి అయ్యాను. శాశ్వతంగా నా హృదయంలో నిలిచిపో! ఈ కాశిలోనే ఉండిపో. నాకు మరెవరి



అండా అవసరంలేదు. భూమి ఉన్నంత కాలమూ ఈ కాశీ ఉంటుందంటారు. కాశీ ఉన్నంతకాలమూ నువ్వు ఇక్కడే ఉండి, మాకు శత్రుభయం లేకుండా చెయ్యి. ఇదే నేను నిన్ను కోరే వరం," అన్నాడు.

మహాదేవి అందుకు ఒప్పుకున్నది.

తరవాత సుదర్శనుడు మహాదేవిని స్తోత్రంచేశాడు. అతను ఆమెను, "తల్లీ, ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? నేనెక్కడికి పోవాలి? నేను స్వయంగా అసమర్థుడనైనప్పటికీ, నీ అండ ఉంటే ఏమైనా సాధించగలను. అందుచేత నా కర్తవ్యం తెలిపి, నన్ను అనుగ్రహించు," అని వేడుకున్నాడు.

దానికి దేవి, "ఇంక చేసేదేమున్నది? నీ భార్యతోసహా అయోధ్యకు వెళ్ళి, సింహాసనం ఎక్కు; తగినవిధంగా రాజ్యం చేసుకో. నిన్ను నేను పైనుంచి కాపాడుతూ ఉంటాను. ప్రతి అష్టమి, నవమి, చతుర్దశికీ నన్ను పూజ చెయ్యి.

నాకు శరత్కాలం ఇష్టం. నవరాత్రి పూజలు చెయ్యి. మాఘ, చైత్ర, ఆశ్వయుజ, ఆషాఢ మాసాలు నాకు ఉత్సవాలు జరిపించు,'' అని హెచ్చరించి అదృశ్యమయింది.

తరవాత రాజులు ఒక్కరొక్కరే వచ్చి, ఇంద్రుడికి దేవతలు మొక్కిన విధంగా సుదర్శనుడికి మొక్కి, అంబను స్తుతించారు. వాళ్ళు అతన్ని తమ చక్రవర్తిగా ఆమోదించారు.

సుదర్శనుడు అయోధ్యకు చేరే లోపునే వార్తలు చేరాయి.అందుచేత మంత్రులు మంగళవాద్యాలతోసహా ఎదురువచ్చి, సుదర్శనుణ్ణీ, అతని భార్యనూ నగరంలోకి తీసుకుపోయారు.

సుదర్శనుడు తన సవతి తల్లి వద్దకు పోయి, కొడుకు చచ్చి ఏడుస్తున్న లీలావతికి నమస్కరించి ఓదార్చి, ''అమ్మా, నీ తండ్రినీ, నీ కొడుకునూ చంపినది నేనుకాదు, మహాశక్తి! నీ పాదాల సాక్షిగా చెబుతున్నాను. ఎవరో చేసిన కర్మకు నువ్వెందుకు బాధపడాలి? నన్ను నీ కొడుకులాగే చూసుకో. నీకు ఎల్లప్పుడూ మాతృసేవలు చేస్తాను. నేను పసివాణ్ణి అయి ఉండగా నీ తండ్రి దురుద్దేశంతో నన్ను రాజ్యభ్రష్టుణ్ణిచేస్తే, అది నా ప్రారబ్ధం అనుకున్నాగాని, దుఃఖించ లేదు. నీ తండ్రి నా తాతను చంపేస్తే, నా తల్లి పుట్టెడు దుఃఖంతో నన్ను తీసుకుని అడవిదారిన పోతుంటే, మమ్మల్ని దొంగలు దోచారు.తరవాతగంగాతీరానఋుష్యాశ్రమంలో తలదాచుకున్నాం. వాళ్ళ అనుగ్రహంవల్ల ఇవాళ ఈ స్థితికి వచ్చాం. ఇప్పటికీ కూడా నాకు ఎవరిమీదా ద్వేషం లేదు,'' అన్నాడు.

అతని మాటలు విని లీలావతి సిగ్గుపడుతూ, ''నేను వద్దంటున్నా వినకుండా నా తండ్రి నీకు ద్రోహంచేసి,తాను చావటమేగాక, నా కొడుకునుకూడా చంపాడు. నీ తల్లి నా అక్క, నువ్వు నా కొడుకువు! నేను విచారించవలసినదేమిటి? నా వాళ్ళు చావటానికికారణం నువ్వు కాదని నాకు తెలియదా?'' అన్నది.

తరవాత సుదర్శనుడు తన మంత్రులచేత ఒక బంగారు సింహాసనం తయారుచేయించి, దానిమీద జగదంబను యథావిధిగా స్థాపించి, రోజూ పూజిస్తూ, పట్టాభిషేకం చేసుకుని, సుఖంగా చాలాకాలం రాజ్యం చేశాడు.





# వ్యాపకం

రాఘవయ్య రోజూ సాయంత్రం గుడికి వెళ్ళి, అక్కడికి వచ్చిన భక్తులకు పురాణం చదివి వినిపించి, అర్థం వివరించి అడిగిన ప్రశ్నలకు జవాబు లిస్తూంటాడు. అందు కని రోజూ ఉదయమే లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాక, ఒక రెండు గంటలసేపు ఆ రోజు తను చదివి వినిపించబోయే పురాణ ఘట్టాల్ని శ్రద్ధగా అధ్యయనం చేసుకుంటాడు.

రాఘవయ్య భార్య సీతమ్మ పెరట్లో పండిన దూదితో వత్తులు తయారుచేస్తుంది. వాటిని అమ్మితే వచ్చే తృణమో, పణమో ఆమె ఒక డబ్బాలో వేసుకుని దాచుకుంటుంది.

ఆ దంపతులకు ముగ్గురు కొడుకులు. పెద్దవాడు వీరయ్య వడ్రంగంలో నిపుణుడు. అతడి భార్య కామాక్షికి ఇంటిపనులతోనూ, వంట పనులతోనూ రోజంతా సరిపోతుంది. వీరయ్య తమ్ముడు రంగయ్య బట్టలకు రంగులు వేయడంలో దిట్ట. రంగయ్య తర్వాతివాడు నారయ్య, ఇంటివెనకవున్న పెద్ద పెరట్లో తోటపని చేస్తాడు. ఫలవృక్షాలే కాక కూరగాయల పాదులూ, పూలమొక్కలూ వుండడంవల్ల, ఆ తోటనుంచి రోజూ ఫల సాయమూ వస్తుంది; అక్కడ చేతినిండా పనీ వుంటుంది. ఆ ఊళ్ళో అందరూ రాఘవయ్య కుటుంబాన్ని ఆదర్శంగా చెప్పుకుంటారు. ప్రతి ఇంట్లోనూ అంతా అలా ఏదో ఒక పనికొచ్చే వ్యాపకం పెట్టుకుంటే, సిరిసంపద లకే కాక మనశ్శాంతికీ లోటుండదని చాలా మంది అనుకునేవారు.

పొరుగూరిలో వుండే మాధవయ్య కుటుంబం ఇందుకు పూర్తిగా విరుద్ధం. ఆ ఇంట్లో అత్తాకోడళ్ళకు దెబ్బలాట, అన్న

జొన్నలగడ్డ రామలక్ష్మి



దమ్ముల మధ్య సామరస్యం లేకపోవడం వల్ల, ఒక్కరోజు కూడా మాధవయ్యకు మనశ్శాంతి వుండేది కాదు.

రాఘవయ్య, మాధవయ్యకు దూరపు బంధువు. ఆయన కుటుంబంలో సామరస్యం గురించి వినడంవల్ల, అతనెలా సాధించాడో తెలుసుకుందామని, ఒకసారి మాధవయ్య, తన భార్యరంగమ్మను వెంటబెట్టుకుని, రాఘవయ్య ఇంటికివెళ్ళాడు. ఆ దంపతులను రాఘవయ్య కుటుంబంలోని వారందరూ సాదరంగా ఆహ్వానించారు. ఒక రోజంతా అందరూ ఉత్సాహంగా కాలం గడిపారు. మర్నాడు రాఘవయ్య ఎప్పటిలాగే తన చదువులో పడి పోయాడు. అందుకు మాధవయ్య నొచ్చు కుని, "నేనున్న రెండ్రోజులూ నాతో సరదాగా గడపొచ్చుగదా, నీ చదువెప్పుడూ వుండేదే కదా!" అన్నాడు. అందుకు రాఘవయ్య నవ్వి, "మనిషికున్నంత బద్ధకం మరే ప్రాణికీ వుండదు. ఒకసారి పద్ధతి మారిందంటే యథాస్థానానికి రావడం అసాధ్యం. అవసర మైనప్పుడెలాగూ తప్పదు కానీ, ఇప్పుడ లాంటిదేమీ లేదుకదా! మనం ఇద్దరం కలిసి పురాణం అధ్యయనం చేద్దాం. అందువల్ల నీకూ నాకూ కూడా కొత్త ఉత్సాహం పుట్టు కొస్తుంది," అన్నాడు.

"ఇలాగైతే మీ ఇంటికొచ్చి మీ పనులు పాడుచేశాననిపిస్తుంది, నాకు. ఇంకెప్పుడూ మీ ఇంటికి రానులే," అన్నాడు మాధవయ్య నిష్ఠూరంగా.

"అలా అనిపించకుండా కూడా, మా ఇంట్లో వుండొచ్చు. అదెలాగో నీకే తెలుస్తుంది. ముందు పురాణం చదవడం మొదలు పెడదాం," అన్నాడు రాఘవయ్య.

ఇద్దరూ చదవడం ప్రారంభించారు. పురాణకథల్లో అంత లోతైన అర్థాలుంటా యని తెలియని మాధవయ్య ఆశ్చర్యపోతే, ఆయన అడిగే కొత్తతరహా ప్రశ్నలకు జవాబులివ్వడానికి, రాఘవయ్య తన బుద్ధికి మరింత పదును పెట్టవలసి వచ్చింది.

ఈ సంగతి గ్రహించాక, మాధవయ్య, "ఇకమీదట నీ ఇంటికి పురాణం గురించే వస్తాను. నువ్వు మా ఇంటికొచ్చేటప్పుడు కూడా, నీ పురాణగ్రంథాలు తీసుకువస్తే బాగుంటుం దనిపిస్తున్నది," అన్నాడు రాఘవయ్యతో.

ఇదిలావుండగా రంగమ్మ, సీతమ్మవద్దకు వెళ్ళి, "ఈ ముసలితనంలో నీకీవత్తులు చేసే కర్మేమిటమ్మా! హాయిగా కాలిమీద కాలేసుకు కూర్చోవచ్చుకదా!" అన్నది.

"వయసులో వున్నప్పుడు ఇంటెడు చాకిరీ చేసేదాన్ని, ఇప్పుడు కూర్చునేవున్నానుకదా? ఊరికే కూర్చునేబదులు వత్తులునలుపుతున్నానంతే!" అన్నది సీతమ్మ.

"ఇలా కూర్చుని వత్తులు నలుపుతున్నావు కాబట్టే, నీకోడలు నీ గురించి పట్టించుకోవడం లేదు. అదినువ్వుకనబడగానే, లేచినిలబడదు. వంటచేసేటప్పుడూ, ఇల్లు సర్దేటప్పుడూ, నీ సలహాలడగాలనుకోదు. ఈ ఇంటికి నువ్వుపెద్ద దానివే తప్పపెద్దరికం లేదు," అన్నది రంగమ్మ.

ఆ మాటలకు సీతమ్మ చిన్నగా నవ్వి, "మొదట్లోనేనూ అలాగే అనుకుంటూ వుండే దాన్ని! కానీ ఇరుగుపొరుగుల దగ్గర కోడల్ని తిట్టడంవల్ల, నాకు మనశ్శాంతి దొరకలేదు సరికదా, దానిపట్ల ఇంకా కసిపెరిగి రక్తపు పోటు కూడా వచ్చి మంచం పట్టాను. అప్పుడు వైద్యుడు నన్ను ఊరికే కూర్చోకుండా ఏదైనా వ్యాపకం కల్పించుకోమన్నాడు. మనిషికి తీరుబడి ఎక్కువైతే, ఇతరుల గురించి లేనిపోని అనుమానాలు వస్తాయి. ఏదో ఒక వ్యాపకం వున్న మనిషికి, ఇతరులలో లోపాలే కనిపించవు. నా సంగతే చూడు! వ్యాపకం వల్ల నాకు ఎవరిలోనూ చెడ్డగుణం కనిపించడంలేదు. నా ఆరోగ్యం బాగుంది. అంతో ఇంతో సంపాదిస్తున్నాను. ఇంట్లో కూడా నాకేలోటూ జరగడంలేదు," అన్నది.

సీతమ్మ చెప్పింది విని, బాగా ఆలోచించి చూడగా, రంగమ్మకు అనిపించింది-తన ఇంట్లో తనకూ ఏ లోటూ జరగడంలేదని! తర్వాత ఆమె భర్తతో, "ఈ ఇంట్లోని మన శ్శాంతికి కారణం వ్యాపకం. మన పిల్లల్ని కూడా ఒకసారి ఇక్కడికి పంపాలి," అన్నది.

మాధవయ్య అందుకు సరేనన్నాడు కానీ, వాళ్ళింటికి తిరిగివెళ్ళి తమ ప్రవర్తనలు మార్చుకున్నాక, వాళ్ళింట్లోనూ మంచి మార్పులు వాటంతటవే వచ్చాయి. ఇంట్లో ఒకరిద్దరికి మంచి వ్యాపకాలున్నా, మిగతా వారిలో మార్పు రావడానికి ఎంతోకాలం పట్టదని అప్పుడు తెలుసుకున్నారు, మాధవయ్య దంపతులు.



# భూస్వామి వయసు

ద్రోణపురి రాజు మణిచంద్రుడు మరణించడంతో, పాతిక ఏళ్ళ వయసువాడైన ఆయన కుమారుడు భువనచంద్రుడు రాజ్యాధికారానికి వచ్చాడు. రాజ్యపాలనా వ్యవహారాలు చూసేందుకు సమర్థులైన మంత్రులుండడంతో అతడు తరచుగా వేటకు వెళ్ళి వారం,పది రోజులకుగాని రాజధానికి తిరిగి వచ్చేవాడు కాదు.

ఒకసారి భువనచంద్రుడు వేటకు వెళ్ళి, చీకటిపడిన తర్వాత, ఆ రాత్రికి ఎక్కడ కాలం గడపడమా అని వెంట వచ్చిన భటులతో సంప్రతిస్తూండగా, సంగతి తెలిసిన శేఖరవర్మ అనే భూస్వామి స్వయంగా వచ్చి, తన ఇంట ఆతిథ్యం స్వీకరించవలసిందిగా భువనచంద్రుణ్ణి కోరాడు.

ఆ రాత్రి భోజనాలవీ అయ్యాక మాటల సందర్భంలో భువనచంద్రుడు శేఖరవర్మను, ''మీ వయసు ఎంత?''అని అడిగాడు.

''మహారాజా! అరవై, డెబ్భై వుండవచ్చు,'' అన్నాడు శేఖరవర్మ.

ఆ జవాబుకు ఆశ్చర్యపోయిన భువనచంద్రుడు, ''కాలంతోపాటు పైబడుతున్న వయసును గురించి తగు జాగ్రత్తలో వుండాలన్న ఆలోచన మీకు లేదన్నమాట!'' అన్నాడు.

ఆ ప్రశ్నకు శేఖరవర్మ చిన్నగా నవ్వి, ''మహారాజా! నా స్వాధీనంలో పంటభూములు ఎన్ని ఎకరాలో, ఇంట్లోవున్న రెండు పెద్ద భోషాణాల్లో ఎన్ని బంగారు, వెండి కాసులున్నవో- ఇలా అన్నిటి గురించీ తగు జాగ్రత్తలో వుంటాను. ఎందుకంటే, వాటిని ఎవరైనా అపహరించుకుపోయే ప్రమాదమున్నది. కానీ, నా వయసును అపహరించాలని ఎవడూ అనుకోడుగదా! అందువల్ల, దాన్ని లెక్కిస్తూ కాలం వృధాచెయ్యను,'' అన్నాడు.



ఇదొక చందమామ కానుక!

9

# అజేయుడు గరుడుడు

చిత్రాలు: పాణి

చంద్రపురి రాజ్యంలో సేనాధిపతి నరేంద్రదేవుడూ, అతని కొడుకు రవీంద్రదేవుడూ సృష్టిస్తూన్న అరాచకాలను గరుడుడు భగ్నం చేయసాగాడు. గరుడుణ్ణి పట్టుకునే ప్రయత్నాలు విఫలమయ్యాయి. రాజు మహేంద్రదేవుడు, మరణించిన ప్రధానమంత్రి కుమారుడు ఆదిత్యుణ్ణి ప్రధానమంత్రిగా నియమించాడు. తండ్రి ఆదేశం ప్రకారం ఆదిత్యుడు గరుడభగవానుడి ఈకను ఏడు పౌర్ణములు పూజించాడు. ఏడవ పున్నమిరాత్రి పూజిస్తూండగా గదిలో వింతకాంతి వ్యాపించింది. ఆదిత్యుడు విచిత్ర అనుభూతికి లోనయ్యాడు. విగ్రహం పాదాలవద్ద ఉన్న ఈక గాలిలో తేలుతూ పెద్దది కాసాగింది.

వింతకాంతి ఆదిత్యుడి శరీరాన్ని కవచంలా ఆవరించింది. తన శరీరంలో కొన్ని మార్పులు రావడం అతడు గమనించాడు.

...అతడి వక్షస్థలం, వీపు భాగాలలో ఈకల కవచం ఏర్పడింది.

... డేగ తలలాంటి కిరీటం ఏర్పడింది. కళ్ళు ఎరుపెక్కాయి. కాళ్ళకు లోహపు తొడుగులు ఏర్పడ్డాయి.











ఆదిత్యుడి చుట్టూ వున్న దివ్యకాంతి మెల్లగా కరిగిపోతూ అతని శరీరంలో ప్రవేశించింది. అతని ఎదుట ఒక తేజోరూపం కనిపించింది.



గదిలో మళ్ళీ చీకటి అలముకున్నది. ఎవరో తలుపుకొట్టే చప్పుడు వినిపించింది.











అదే సమయంలో గరుడుడిలా ముసుగులు ధరించిన పలువురు మళ్ళీ ప్రజలపైబడి అలజడి సృష్టించసాగారు.


ఆదిత్యుడికిఫిర్యాదులుఅందాయి.
''ప్రభూ! ఇవన్నీ నరేంద్రదేవుడి దుండగాలే!''
''వీరబాహులా! మనం వాటిని బయటపెట్టాలి.''


మరునాడు రాజభవనంలో
''ప్రజలు గరుడుణ్ణి పట్టుకున్నారు. ఒక్క గరుడుణ్ణికాదు. ఆరుగురిని!''


''వాళ్ళకు బహిరంగ ఉరిశిక్ష విధించాలి. రేపు ఉదయమే ఉరితీయించాలి. ఇప్పుడే చాటింపు వేయించు!''
''చిత్తం, మహాప్రభూ!''


రాజ్యమంతటా చాటింపు జరిగింది.


రవీంద్రదేవుడు హడలిపోయాడు.
''ఇప్పుడు మనం ఏంచేయాలి?''
''బహిరంగ ఉరిశిక్షను అడ్డుకోవాలి!''
ఇంకావుంది

ORISSA
The soul of India

మీకు ఒక క్విజ్

# చిలికా సరస్సు!

December
1-5, 2001
Konark Festival

ప్రకృతి రామణీయతకు పెట్టిందిపేరు ఒరిస్సా రాష్ట్రంలోని చిలికా సరస్సు. 1,100 చ.కి.మీ.కు పైగా విస్తరించి ఉన్న ఈ ప్రశాంత సరస్సు పక్షుల అభిమానులకు నిజంగానే పక్షుల స్వర్గంగా కనిపించి మురిపిస్తుంది. తెల్లచారల సముద్రపు డేగలు, ఎరుపు అడవికోళ్ళు, హెరాన్లు మొదలగు అసంఖ్యాకమైన పక్షిజాతుల శాశ్వత నివాసస్థానం ఈ సరస్సు.

ఎర్రకొంగ జాతికి చెందిన ఫ్లెమింగో పక్షులు చిలికా సరస్సు ప్రత్యేక ఆకర్షణ!

చీటాల్స్, బ్లాక్ బక్స్ అనే నల్ల జింకలు, కోతులు, చేపలుపట్టే పిల్లులు, ముంగిసలు, ముళ్ళ పందులు, పాములు, తాబేళ్ళు, తొండలు మొదలైన రకరకాల వన్యమృగాలను సరస్సు చుట్టూ ఉన్న కొండలలో, అడవులలో చూసి ఆనందించవచ్చు!

సరస్సు మధ్య ఉన్న చిన్నచిన్న దీవులను లాంఛీ లలో వెళ్ళి చూడవచ్చు. సరదాగా పడవలలో వెళ్ళి రావడానికి, చేపలు పట్టడానికీ సౌకర్యాలు వున్నాయి.

జలక్రీడలపట్ల ఆసక్తి ఉన్నవారు 'వాటర్ స్పోర్ట్స్ కాంప్లెక్స్'లో తనివితీరా ఆడుకోవచ్చు.

ఇక్కడికి 28 కి.మీ. దూరంలో శతపద అనే సుందరప్రదేశంలో చిలికా సరస్సు సముద్రంలో సంగమిస్తోంది. మీ అదృష్టం బావుంటే కొన్ని డాల్ఫిన్స్ అక్కడ మీకు కనులవిందు చేస్తాయి.

అక్కడికి చేరుకోవడం ఎలా? పూరీ, కటక్, భువనేశ్వర్ నగరాలనుంచి బస్సులు, టాక్సీలు ఉన్నాయి. కోల్‌కత - చెన్నయ్ రైలుమార్గం బలుగాన్, చిలికా, రాంభా మీదుగా చిలికా సరస్సును ఆనుకుని వెళుతుంది.

ఇక్కడికి సమీపంలో ఉన్న విమానాశ్రయం: 100 కి.మీ. దూరంలోని భువనేశ్వర్.

## మీకు ఒక క్విజ్

14– ఏళ్ళ లోపు పిల్లలకు

పోటీ – 2

1. మనదేశంలో అరవై నాలుగుమంది యోగినులకోసం నిర్మించిన దేవాలయాలలో ఇంకా నాలుగు నిలిచి ఉన్నాయి. వాటిలో ఒకటి ఒరిస్సాలో ఎక్కడ ఉందో తెలుసా?

..........................................

2. పసిఫిక్ రిడ్లీ తాబేళ్ళు తమ నివాసమైన దక్షిణ అమెరికా నుంచి చాలాదూరం ప్రయాణంచేసి వచ్చి ఒరిస్సా శరణాలయంలో నివాసాలేర్పరచుకుని పొదుగుతాయి. ఆ శరణాలయం పేరేమిటి?

..........................................

3. ఒరిస్సాలోని ఒక సుప్రసిద్ధ జంతుప్రదర్శనశాల విలక్షణమైన పులులకు పేరుగాంచింది. జంతుప్రదర్శనశాల ఏది? విలక్షణమైన ఆ పులిజాతి పేరేమిటి?

..........................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekkatuthangal, Chennai - 600 097.**

పేరు ..........................................
వయసు ..........................................
చిరునామా ..........................................
..........................................
పిన్ .................... ఫోన్ ..........

ORISSA TOURISM

Winners picked by Orissa Tourism in each contest will be eligible for **3-days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar - 751 014. Ph : (0674) 432177, Fax : (0674) 430887, e-mail : ortour@sancharnet.in. Website : Orissa-tourism.com




# ఫోటో వ్యాఖ్యల పోటీ







ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 20వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు డిసెంబర్ 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.



## అభినందనలు

ఆగస్ట్ 2001 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
వందనపు రామగోవిందం
1-8-43, జయా ఫోటోస్టూడియో వెనక ఎన్.
ఐ.ఆర్.డి.రోడ్, రాజేంద్రనగర్
హైదరాబాదు-500 030.

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో : చేతికి అందినా...
రెండవ ఫోటో : చెప్పినట్టు వినదు!

చందమామ సంవత్సరచందా:
ఇండియాలో రూ.120లు
Payment in favour of CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

